సంగీత

# కాంతామతి

ఇది

సత్యహరిశ్చంద్ర, మనోరమ, అరేబీదేశపుకథలు

మొదలైనవి వ్రాసిన

బ్రహ్మశ్రీ చెఱుకుపల్లి వేంకటరామయ్యచే

రచియింపఁబడినది.

పబ్లిషర్

కాళహస్తి తమ్మారావుగారి కుమారుడైన

సూర్యప్రకాశరావు

ప్రొప్రైటర్

అంబికా బుక్కు డిపో

రాజమహేంద్రవరము.

రెండవ కూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము,

నిడమర్తి వెంకటకృష్ణమూర్తి అండు బ్రదరువారి

శ్రీ కృష్ణా ముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడినది.

1927.

 [వెల 0—12—0.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు

సూత్రధారుఁడు.

విక్రమార్కుడు—ఉజ్జయనీదేశపురాజు.

మంత్రి.

శక్తివర్మ—కాంతామతి తండ్రి.

| | |
|---|---|
| వేగవంతుఁడు— | కాంతామతియున్న చెఱసాల |
| గుణవంతుఁడు— | కావలివారు. |

కిరాతులు—ద్వారపాలురు వగైరాలు.

స్త్రీలు.

నటి.

కాంతామతి—విక్రమార్కుని భార్య.

మదనమాలిని—దాసి.

## భూమిక

ఇప్పుడు సహజముగా స్త్రీవేషధారులు తక్కువయగుటచే స్త్రీపాత్రలు ఎక్కువగానున్న నాటకముల బ్రదర్శించుట కష్టముగానున్నదనియు స్త్రీపాత్రల తక్కువగాగల నాటకమొకటి రచింపుమని కొందఱు మిత్రులు నాతో జెప్పియుండిరి. ఆకారణమున "కాంతామతి" నాటకమును రచించితిని.

ఇది చాలకాలము క్రిందట రచింపఁబడియు ప్రచురింపఁబడు భాగ్యము లభించినదికాదు. నేడు కాళహస్తి సూర్యప్రకాశరావుగారు దీనిని బ్రకటించెదమన్నియు, దీనిస్వాతంత్ర్యము తమ కొసంగుమని కోరినందున వారి యభీష్టము నెరవేర్ప నుద్దేశముతో బ్రకటనాధికార మొసంగితిని. ఇంక నిట్టినాటకముల వ్రాయ బ్రోత్సాహ మొసంగెదరుగాక. ఇందు కొన్ని తప్పులుండవచ్చును. వానిని దయతో దెల్పిన రెండవకూర్పులో సవరించుకొనెదనని పండితులకు మనవిచేయుచున్నాను.

ఇట్లు విద్వద్విధేయుఁడు,

చెఱకుపల్లి వేంకటరామయ్య.

శుభమస్తు.

# కాంతామతి.



## ప్రథమాంకము.



### నాంది

ఉ. తన్నవమానముం బరపె తాళుదునే నివుడంచు కోపసం
పన్నమనస్కయై హరిని బాసి యరణ్యమునందు గోర్కెమై
వెన్నుని పెన్నురంబునను వేడ్కజెలంగ వసించు లక్ష్మి దా
గ్రన్నన నాథుతోఁ గలసి కావుత సభ్యుల క్షేమ సంపదన్.

నాంద్యంతమున సూత్రధారుఁడు

సూ.—రసగ్రహణానుకూలమతివిశేషనిరతిశయులగు నో సభాస్తారులారా! సూర్యసమతేజోధుర్యులారా! చంద్రకిరణతిరస్కృతామలయశోవిరాజితదిగంతరాళులారా! అంగారకసదృశశుచిత్వలలితులారా! బుద్ధిజితబుధులారా! గురుమతిగురులారా! శుక్రనీతివిశారదులారా! "ఈవసంతసమయంబున నేదేని మనోహరనాటకమాడి మమ్ము సంతోషపెట్టుడనికదా నుడివితిరి. అట్టినాటకరాజమేదికలదో బహుళనాటకపరిశీలితాంతఃకరణులును సమయస్ఫూర్తిజలధియు నగు మదీయ ప్రేయసితో నాలోచించెదను.

నటి—(ప్రవేశించి) నాథా! మన్నింపుము; జనులోక విషయమునుగూర్చి తబ్బిబ్బుగుచుంటచే నదేమియో విచారించి వచ్చుటచే సంత యాలస్యమైనది

సూ.—ఎందుకట్లు ప్రజ తబ్బిబ్బులగుట.

న—వెనుక తిరుమలేశ్వరుని భార్య మగనితోఁ బట్టుబట్టి వెడలిపోయినది కదా?

సూ—ఔను. నే నెఱింగిన యంశమే.

న—ఇప్పుడు చక్కని కుమారుని వెంటఁ బెట్టుకొని వచ్చినది

సూ—అయిన

న—ఎంత సిగ్గుమాలిన యాఁడుదియో కాని వీఁడు నీకుమారుఁడని మగనితో వాదించుచున్నదట.

సూ—తిరావ్రత.

న—అందఱు చేరి వారిని సఖ్య బఱచి యద్దానిని గూర్చి చెప్పుకొనుచున్నారు. ఆసంగతి వినుచుండుటచే నింత ప్రొద్దు పోయినది

సూ—(జ్ఞప్తి నభినయించుచు) సఖి! అనవసరపు వ్యవహారము మాటాడుచు ప్రస్తుతాంశమును మరచితిమి.

న—నాథా! కర్తవ్య మేమి;

సూ—„ ఎద్దియేని నవీననాటకమాడి మము సంతోషపెట్టు" మని అట్టినాటక మేది కలదు?

న—నే నుడివిన యంశములే కల యొక నాటకమును మొన్న నే చూచియుంటిని. దానిని బ్రదర్శించిన బా గుండును.

సూ—ప్రియసీ! దానిని రచించిన వారెవరు?

న—సఖా! వినుండు.

సీ. బాలకులను నీతి బాగుగా బోధింప
బాలనీతిని వ్రాసి వరలినాఁడు
సరసులు మెచ్చంగఁ జతురత ద్రౌపదీ
వస్త్రాపహరణంబు వ్రాసినాఁడు
పండితపామరుల్ పలుహర్షమునొంద
నింద్రవిజయము రచించినాఁడు
గానవృత్తంబులు గడునేర్పు మెరయ „గాం
తామతి" నాఁగూర్చి తనరినాఁడు

గీ. శౌనకసగోత్రిభవుండు ప్రజ్ఞాలలితుండు
చెఱుకుపల్లి వంశజలధి శ్రీయనుజుండు,
విమల కృష్ణసూర్యసుతుండు విశదకీర్తి
యురయ వేంకటరామాఖ్య నలరువాడు.

సూ—తరుణీ! ఈపని గ్రంథరచన కదూహ్యాద్యంబని వింటిని. నేడు కని యానదించెదను. కాని, సఖి! నీమాటలనమ్మి యీసరసాగ్రేసరులకడ బ్రదర్శించి నగుబాట్ల నొందెదనేమో యనిభయమగుచున్నది.

న—ఆర్యా!

గీ నవ్వబనిలేని జాలిని నివ్వటులెడు
పట్ల నవ్వకుండరుబోయ భాషాణముల
మఱియు నయ్యెయెడలజూడ మనసునందు
బుట్టె రసముల కేరీతి బొడలుజూరా

సూ—సఖి! యిప్పటికె చాలయాలస్యమొనర్చితిమి. వసంతాగమాలిందసంభరిత పరభృతారావ వినోదకాంక్షితంబును, భృంగాంగనాకృత ఝుంకారబంధురంబును, శుకశారికాకూజిత కుతూహలంబును, శృంగారరసస్థాయియు నగు నీ వసంతంబును నీ మతివిశేషంబున వర్ణింపుము

న—చిత్తము.

సీ. పికసంపతికిఫల ప్రకరంబుదనియించి
చూపముల్ వాత్సల్య శోభగాంచ
మధులిహంబులకు సమ్మతిమకరందము
నిచ్చిలతాంపముల్ హెచ్చుగాంచ
మలయవాయువు పరిమళయుతమై పాంథ
జనులకు మదిమిచ్చివినుతిగాంచ

వట్టుమ్రోడులువల్లన స్ఫూర్తిగనులకుఁ
బండువోసంగుచుఁ బరిఢవిల్ల
గీ. చంద్రకిరణంబు లెంతయుఁ జలువవీయ
రమణశాహులతావిహార కలితలయి
బాలలెంతయు నాహ్లాదభరముఁజెంది
యీవసంతతా సరముల నింపుగాంత్రము.
[తెఱఁగో]

అట్టి సంతోషమునకే నర్హురాలనా?

సూ—(విని) సుందరీ! నీ గానమాధుర్యము వర్ణనాతీతము. మనగానకళాభిధాన తననామము సార్థకముగఁ గాంతామతియై నిలిచి నాథుని రాకకై యెదురుచూచుచున్నది. కావున మనము తడయుజనదు

న—చిత్తము. [ఇరువురు నిష్క్రమింతురు.]

ఇది ప్రస్తావన.



# కాంతామతి



## ప్రథమాంకము.



రంగము—ఉద్యానవనము.

కాంతా—(ప్రవేశించి)

చిత్రపదవృత్తము—సొగసలోచన శౌరీ!
గోరెద నిన్నెదభక్తిన్
నారమణుం గనుగూర్మిన్
శ్రీరమణా! తగ గావన్.

ఆహా! నేటికి నయిదుదినంబులయి వివాహమయ్యు మదీయ ప్రాణనాథుని దర్శించు భాగ్యమలవడినది కాదు. ఈ రోజున "శయనాగారంబున కరుదెంతు" మని వర్తమానమంపుటచే విందువచ్చి "చంద్రోదయమునకు నిరీక్షించు చాతక" మట్లుంటిని. ఆమహానుభావుండు దయచేయునని యెదురుచూచుచుండుటచేఁ గన్నులు కాయలుకాచినవి. మద్విభుని దివ్యనామ సంస్మరణమాత్రమున శరీరమున బులకలుద్భవించుచున్నవి. నా నాథుఁడు దయచేసినచో

ఉ. ముచ్చటదీరఁజూతుకద మోహనమూర్తిని బాహువల్లరిన్
హెచ్చుతమింగవుంగిట వహించి సుఖింతుననంగ కేళిలో
విచ్చుమనంబుతో నధరబింబమునందలి పట్టునొక్కుతో
గుచ్చినగోటిపోటు లనుకూలతఁ జెందెదు గబ్బిగుబ్బతోన్.

(ఇటునటు పరికించి) చెలికత్తె లెవ్వరిట లేరుకదా? వినిన హేళనమొనరింపఁ జూచెదరు. నా ప్రాణవిభుఁడు వచ్చుజాడ కనఁబడదే? మన్మనోవల్లభా! నిమిషమొక యుగంబుగ గడపు నీచెలి బ్రోవ వేగరమ్మా. కాలాతిక్రమణమైన విరహోద్రేకవిభిన్నమనస్కనై యచేతనక్రియనుండు భవదీయ జాయం గాంచి జాలిం గూరెదవు.

(మలయవాయువుసోకి పులకలుగ్రిమ్ముట చూచి) అబ్బా! యేమిది? వడగాడ్పు కొట్టుచున్నయది. (పరికించి) కాదు. కాదు.

గీ. మలయగిరిదుర్గమందు బయలు వెడలుచు
కమలసంతతుల పరిమళములనొరసి
సాంద్రశీతలవాఃపూర సరసిజేరు
మందమారుతి మిదినాకు మారకంబు.

అబ్బబ్బా! ఈవడగొట్టునకే బెదరుచుండ “గోరుచుట్టుపయిరోకలిపో” టనునట్లు లీచందమామకూడ జేరి బాధించుచున్నాఁ డేమిసేతును?

ఉ. రూపముజెందినావు ననుబ్రోచెదుతేని కోలంబు సామిచే
దాపముపెట్టుచుంటివికదా మగవాంద్రను నిర్దయాత్మతన్
బాపమటంచు నెంచవు స్వభావము క్రూరముపామ్రమింగ సం
తాపముజెందవే పరుల తాపములట్టినటం చెఱుంగవే.

నీవు మిన్నందుట నా మనోహరుఁడు వచ్చునంతవఱకే కానిమ్ము. ఓ పాడుపికమా! నీకుగూడ సమయమిపుడే యాలవడినదా? కూయుము. కూయుము.

గీ. ఒగరులెగటునుగలిగిన చిగురులదిని
త్రుళ్లిపడెదవు నీకింత తుచ్ఛమతివి
నాథునధరామృతాస్వాదనసుఖమేను
గొనఁగ “జూచికన్నుల నిప్పగొనవె పికము!”

ఓగండుతుమ్మెదా! వైరులతోఁగలసి నీవుకూడ దుష్టత్వమూనుచుం టివా? ఎట్టిమంచివారికైన దుర్జనసాంగత్యము చెట్టతనము కలిగింపక మానదు. అయ్యారె! ఈపాడుచిలుక కేమిదుర్బుద్ధియో కాని శ్రుతి కటువుగ బలుకుచున్నయది. ఓప్రాణప్రియా! త్వరగ రాకున్నచో నీ దుష్టశత్రుమధ్యంబున ననదనై చావవలసివచ్చును. ఈరాకాసిమూ కల నీసడించి యబలనను గావలేవా? రమ్ము. రమ్ము.

విక్రమార్కుడు—(ప్రవేశించి పరిక్రమించుచు) నేననుకొని నంతఁ జేసితిని. దీని గడసుతనమేమో కొంతవరకు వినోదార్థముగా బరీక్షించి పిమ్మట కాపరాగారమందుంచెదను. (అని సమీపించును)

కాంతా—మనోహరా! వందనము. రాజకార్యనిర్వహణా యాస విశ్రాంతస్వాంతులగు భూకాంతుల కింతుల మనోజ్ఞహాసభా షణ వినోదములేకదా ప్రమోదజనకంబులు?

విక్ర—(తనలో) అప్పుడే తనబుద్ధివిశేష ముపయోగఁజేయుచు చున్నది. (ప్రకాశముగా) తరుణీ! నీవుచెప్పునది యదార్థమే కాని,

కాంతా—(తనలో) "కాని" అని యూరకొనుటకు కారణ మేమియో? (ప్రకాశముగా) ఇంతకన్న నెక్కుడెద్దికలదు?

విక్ర—(తనలో) తనతోఁగూడియుండుటకన్న యన్యములేదని యెట్లుసూచించుచున్నదో? (ప్రకాశముగా) లేకపోవచ్చును.

కాంతా—(తనలో) ఇందలి కాకుస్వరమున కర్థమేమిచెపుమా (ప్రకాశముగా) మనోవల్లభా!

గీ. మంత్రికార్యనిర్వహణము మంత్రివలెను;
భుక్తిమాతరీతి, శయనమునను వేశ్య,
తెఱఁగు, రూపమునను రంభ తీరుపనుల
దాసిపోల్కె, క్షమకు ధాత్రి, యా సతీసతి.

విక్ర—అట్టివారు లేరని తలఁచెదను.

కాంతా—లేకేమి? పెక్కురుకలరు

సీ. పరమపతివ్రతా ప్రతిభచేతనెకదా
మృతభర్తజీవనం బతివనిల్పె
పరమపతివ్రతా ప్రతిభచేతనెకదా
రవిరాకకడ్డంబు రమణినిల్పె
పరమపతివ్రతా ప్రతిభ చేతనెకదా
సభలోనభంగంబు సతికిదప్పె
పరమపతివ్రతా ప్రతిభ చేతనెకదా
ముమ్మూర్తులనుగనె పుత్త్రులుగను
గీ. అట్టి లోకపావనులుండంగ నవనినాథ!
యేలకాదితలదూషింతు విద్దగుణాలు
పెక్కులున్నారునమ్మఁడీ నిక్కవముగ
సందుతెమదాసికూడ నొకంశతూగును.

ఆత్మస్తుతి దోషావహమైనను సమయమువచ్చినప్పుడు చెప్పకొనకతప్ప ని సరియగుటచే నిప్పుడు వక్కాణించితిని.

విక్ర—(తనలో) యేమిరా? దీనిగర్వము తనకుఁ దానె పతివ్రతనని పొగడుకొనుచున్నది. ఇట్టివారేఁకాబోలును పతివ్రతాశిరోమణులు "సాహసం షడ్గుణంచైవ" యనునట్లు స్త్రీలకెంతయేని తెగువ కలదు. (ప్రకాశముగా)

క. కులకాంతయిట్టులాడునె?। వెలవెలదు కలందుగాక వినుమోసుదతీ!
వలుపలుకులుపలుకంగా।వలదికనీమహిమజూప బొల్పుటొప్పన్.

అంతవరకీ గృహంబుననే నిన్ను బంధించితిని.

కాంతా—(తనలో) హా! పరమేశ్వరా! ఇదియేమివింత లోక

సామాన్యముగా నాకుమాటంటిని గాని నన్నుద్దేశించిపలికితినా? ఈప్ర సంగము మార్చి మఱియొక ప్రసంగములోనికి దింపెదను. (ప్రకాశ ముగా) నాథా! ఈకప్పురపువిడెము గైకొనుము.

ఉ. కమ్మనితావులంబొదలి కస్తురిచే మిళితంబునొచు సౌ
ఖ్యమ్ములనిచ్చుగావునను కాంతుఁడ; హార్షమునం గొనందగున్
తమ్ములమిద్దిదీనిగడు తత్పరతన్ భవదీయజాయ పే
ర్మిమ్మున వేరచించి యిడెమంజుల చారుకరాంగుళంబులన్

(అని తమలపాకులనివ్వఁబోవును.)

విక్ర—(పుచ్చుకొనక తనలో) భళిరా! జాణయననియ్యదియే చల్లచల్లగ నీప్రస్తావన వదలి మఱియొక గాథలోనికి దింపుచున్నది. (ప్రకాశముగా) సుందరీ! నీసాహసముజూపక వేఱు ప్రసంస యేలచేసె దవు? నిన్ను బఱిణయమగుటకూడ నీ ప్రభావముజూచుటకొరకే కదా? మున్ను నీవొనర్చిన ప్రతిజ్ఞ మరచితివా యేమి?

కాంతా—(గుండెఝల్లున తనలో) అయ్యో! ఇదియేమి విప రీతము. బాల్యచేష్టలచే నాడట్లు కావించితినని నన్నికెరియ వంచింప బోవుచున్నాఁడే? (ప్రకాశముగా) ప్రాణేశ్వరా! అల్పజ్ఞత్వమున నొన రించిన తప్పుల మన్నింపగోరెదను.

[అని నమస్కరించుచున్నది.]

విక్ర—అందినసిఖయు, నండకున్న కాళ్ళుపట్టు బహుమాయా వాగుతులబన్ను యన్నులమిన్నల నెవరు విశ్వసింతురు? ఇదియనినంత జేయనేర్చునో లేదో చూడవలెను. (ప్రకాశముగా) ఓసి మాయలాడి? ప్రతిజ్ఞ నేఁడువేర్చుకొనుట మేలుకదా! అట్లుకానిమ్ము.

కాంతా—(తనలో) ఇదియేమి దురవస్థ. ఈమహానుభావుఁడు దీర్ఘక్రోధమును బూనియున్నాఁడే! (ప్రకాశముగా) దేవా! నాయందు

దయయుంచి ప్రసన్నుఁడవుకమ్ము. పురుషుల స్వాతంత్ర్యములోనుండి వారి యిష్టానుసారము మెలఁగు నబలనగు నే నేమి చేయఁగలను?

గీ. బాల్యమందునదండ్రి యౌవనమునందు
భర్తయు జరనుసుతులు కాపాడవలెను
గాని మానినులకునెందు బూనగలదె
యించుకైన స్వతంత్రంబు నెన్నిచూడ.

తమపాదసేవకురాలనగు నన్ను గరుణించి రక్షింపకున్న వేరు రక్షకులెవరు? రక్షింపుము. రక్షింపుఁడు. (అని కాళ్ళమీఁదఁబడును.)

విక్రమ—(తనలో) ఏమి? దీనిసాహసము. ఏదియో యొకతంత్రమువన్ని నన్ను బంగనుబెట్టజూచుచున్నది. (ప్రకాశముగా) కాంతా! నీవెంత జెప్పిన పంతంబు విడువాఁడను కాను. నీ సాహసము జూపువరకు నిందుండి నిన్ను గదులనీయను.

కాంతా—హాదైవమా! పెద్దింట్లుకాక భర్తలకై కొందఱును మృతిజెందిన మగలకూర్చి కొందఱును, సంసారమందలి లేమిచేఁ గొందఱును, విభుడు జారుఁడై తిరుగుచుండజూచి కొందఱును, సతతంబు దన్ను హింసించుచుండ గొందఱును, అనుకూలుఁడుగాక కొందఱును పలువురు పలువిధముల గుందుచుండగా నాకు ననుకూలుని, గుణనిధిని ఏకపత్నీవ్రతుని, సాధువర్తనుని, మహావిభవయుక్తి గూర్చియు నేడ్పించుచుంటివా? అఘటనఘటనా సమర్థుఁడవగు నీచేత కేదియసాధ్యము? (ప్రకాశముగా) మహారాజా! దీనులనుబ్రోవను దుష్టులను శిక్షింపను జాలిన మహానుభావులగు దేవరయే యొకయాడుదాని నన్యాయముగ శిక్షింతుమన్న నడ్డువారెవరు? కంచెయే చేను మేసిన కాపేమి చేయఁగలఁడు? ఆడువారిబుద్ధి యల్పబుద్ధికదా? నాపైని దయయుంచి నే జేసిన నేరమును మన్నింపుము.

గీ. తలఁతునెప్పుడు మీపాదజలరుహముల
చిత్తమందన్యచింతల జేర్పలేదు
కరుణననుబ్రోవదగును భూకాంత! కాంత
వంతలంబడజేయుటే సంతసంబు?.

విక్ర—నీపలుకులు గట్టిపెట్టి యున్నమాటల సాధింపుము.

కాంతా—[తనలో] "ఇతమిద్ధ" మని నేదియోయొకటి నిర్ణయించువరకీయున వదలునట్లులేదు. ఐనను.

చ. తుదనొకసారిబ్రార్థనము తోరపుభక్తిని జేసి చూచెదన్
మదినయబుట్టినట్టిదియు మానినదైవమె నాకు దిక్కటం
చుఁదలఁచి పూనగావలయుఁ జొప్పడు కార్యవిధానతత్వముల్
జదియొకడైన రాచసతి భావముఫ్రీనతకెందుజొచ్చునే.

మఱియు,

గీ పుట్టినది రాచపుట్టువు మెట్టినయది
రాజరాజగృహంబు కరంబుబట్టు
టెన్నసార్వభౌమునవాహా? యిన్నిచూడ
దైన్యమొందంగనేటికి ధైర్యమెడలి

[ప్రకాశముగా]

సుకాంతి—మనోహరా! ననుందయం। గనంగవం। దనంబిదే॥

పంక్తి—భూపతిమౌళీ! నాపయినేలా! కోపముబూనం। జూపుము శాంతిన్॥

పాలాశగ్రశవృత్తము—

చరణసరసిజముల మసలక గొలుతుందే
వరకరకృపఁ గనఁ దగుఁ బడలిఁ గమద్దీనల్
వరదుఁడవగుము సదయ

విక్ర—పలుపలుకులాడం
ధరశివలదింక కదలను తరణిశశులాఁ॥

సుందరీ! వినుము.

కాంతా—అవహితను.

విక్రి—వసుమతివృత్తము—మగువా! వినుమా! తగవేటికినీ।
తెగువనీత్వరగఁ। దగజూపదగుఁ॥

కాంతా— ఓ జీవితేశ్వరా!

సీ. ఓప్రాణనాయకా! యో కృపాదాయకా!
యో సాధురక్షకా! బాసలేల
సతినొక్కతను గావజాలవా? ప్రజలను
ధర్మమార్గమునెట్లు దన్పుచుంటి
సర్వంబునీవని చాలగనమ్మితి
భారమౌననుబోవ బలసిద్ధా!
కోపంబునాపయి గొనేమటికిచిన్న
చేష్టలబాటింపఁ జెల్లునయ్య?

గీ. న్యాయమన్యాయమెంచుచు నరయఁగను
గాని కట్టడితనమును బూనగునె
రాజులిలగొట్టి బ్రజలెట్లు బ్రతుకగలరు?
వలదు; బలవంతపరచుట వలదువలదు.

విక్రి---(కొంచెము కోపముతో) ఓసిగయ్యాళి! మాటకారి!
నీ నీతులిచ్చట సాగిరావు. నిన్నింటే బంధించెదను, నడువుము.

కాంతా—(కాళ్ళమీఁదఁబడి) దేవా! రక్షింపుము.

చ. పతియరుదెంచునంచు మది వాంఛలుదీర్చెదు నంచునెంచుచుఁ
సతతముపొంగుచుంటె నది సైచకపోయెను కూరిరచిత్తుఁడై

మాతకరిదైవమీయెడల మానవనాయక! నీ కృపాభ్భృతిన్
క్షితిబడయంగవేని నను శీఘ్రమిద్రుంపుము మాటలేటికిన్.

విక్రి—ఏల యాలస్యము? నడువుము- నడువుము.

కాంతా—దేవా! రక్షింపుము. గోటితో బోవుదానికి గొడ్డళ్ళ వరకు దేవలదు. "ధాన్యపుగింజలో బియ్యపుగింజ" యనునట్లు ఎందుకు సామాన్యవిషయమై పెంచవలదు.

గీ. సతులధర్మంబు దెలియంగ శక్యమగునె
వారి చర్య బ్రహ్మకుగన వశముకాదు
మనుజమాత్రునకేరీతి మదిని తెలియు
మానుమానుమా భూవర మచ్చరంబు

విక్ర—ఛి మాయలాడీ!

బింబన్యత్యము—ఓతుంబవా! నీతులునా । చేతమునం । బ్రీతియటే?

కాంతా—ప్రాణనాధా!

స్రగ్విణి—దేవరా! బ్రోవరా! దీననం గావరా!
సావధానాత్మతం జక్కనాలింపుమా
సేవకుల్ సేరముల్ జేసినం గావవే
బ్రోచవే యీవిధి బోటినన్ సద్దయన్॥

విక్ర—ఓసి! జగజంతి! "మగనిగొట్టి మొగసాలకు మొఱ్ఱలు వెట్టెను" దనునట్లు ఏట్లాడుచుంటివే?

కాంతా—(కాళ్ళమీఁదబడి)

త్రిపద-ఓదయితా! జననాథా! వాదముసేయఁగఁజాన్
నా దెసబ్రేముడినీకున్ । లేదో యదృష్టవిహీనన్॥

ద్విపద ఓనాథ! యోసామి! యోకృపావార్ధి
పూనితర్కింపగాఁ బోలునే చెప్పుము

విక్ర— ఓకాంతనీకింత యోవునేవంత
మీఘంబినీకాంతు నెరనెంచవేల?
కాంతా— తగునెపోనీవంటి ధరణినాథులకు
మగువలతో వాదు మాటలుబలుక
విక్ర— సార్వభౌమునినైన సాధించగలదు
గర్వంబుప్రబలంబు కాంతలకెందు
కాంతా— మగువలెమగవారి మర్యాదనిలుప
దగుదురుపెదవారు తగరునిజంబు
విక్ర— మర్యాదగలనాతి మగవారితోకె
గార్యాచరణకయి కడగునేతెలుప
కాంతా— తెలుపసంసారంబు తరుణిచేఁగాగి
నిలనుబెంపుగూడ నేర్పడునదియె
విక్ర— గుణహీనతో గూడి కొనికాపురంబు
ఘనమనిజేయునే కామించిబుధుఁడు
కాంతా— రమణా! ధర్మాదికార్యంబులయందు
రమణిసాధనము ఘోషించుచుమ్మ
విక్ర— పడఁతితోనుంటయే పాపంబుజగతి
విడచుటేయపవర్గ విధముతలంప
కాంతా— సుద కాధారంబు సుందరియగును
నగుబాటురాకుంట నాతికాపాడు
విక్ర— మగువమాయలబడు మానవంతుండు
తెగువబూనితరించు తెన్నుగనుంకో
కాంతా— మానవతులనుసింద మానుమోనాథ!
పూనడీమొదలక్ష్మి పురుషోత్తముండు

విక్ర—చంచలయగులక్ష్మి **జి**క్కఁధరించి
సంచరించెడమది సరణులశౌరి॥
ఓసి గడుసుపోకలమారి! ఎన్నెన్ని వింతల నేర్చితివే? యింక నీసాహసము గూడ గనఁబరపుము.

కాంతా—ఓపార్థివేంద్ర! దయాసాంద్ర! వైభవజితనిర్జరేంద్ర!

చ. పతియొనరింపుమన్నపని పాపమెయైనను బుణ్యమైన స
మ్మతి జరిగింపఁగావలయు మానిని కెందున నాథుసేవయే
యతిముదమిచ్చుఁగావున మహాత్మ భవచ్చరణాబ్జపూజ నా
కతిశ**యమీయ**దేయనుచు నాజ్ఞ శిరంబున దాల్తుధీరనై.

విక్ర—(తిరస్కారముతో) అటులనే నడువుము. నడువుము.

(అని నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# కాంతామతి.

## ద్వితీయాంకము.

---

రంగము—చెఱసాల.

[కాంతామతి లోపలను, వెలుపల నిరువురు భటులు ప్రవేశించుచున్నారు]

కాంతా—హా! ప్రాణేశ్వరా! సంతతారాధితపరమేశ్వరా! ఆడుదాననగు నాయందు నీకెంత దయ లేకపోయెను?

సీ. భర్తృపాదంబుల బలుమారుపూజించి
కనులనద్దునదియె కలికిమిన్న
మగనిశుశ్రూషల మాన్యతజేయుచు
ముదమొసంగునదియె ముద్దుగుమ్మ
దవునికనేసన్నల దగ గ్రహియించుచు
మెలఁగనేర్చినయదె మించుబోఁడి
విభునిసాంగత్యవేళ భరితగళరవం
బునజెలంగినయది పుణ్యశీల

గీ. నాథుతోఁగూడి చెలరేగి నారులందు
మేటియనగను ప్రఖ్యాతిమించనట్టి
నాయసురులేల వానిని బాయవలదె
యడవిగాయు వెన్నెలపోల్కెనయ్యో బ్రదుకు.

ము-భ—ఓయి గుణవంతా! ఇట్టి మంచిగుణాలుకల అమ్మగారిని నే నెక్కడ చూడలేదు. అట్టి తల్లికిట్టిపాటులు పెట్టిన బమ్మదేవర ఎంతకైన దగినవాఁడునుమీ?

గుణ—ఓ వేగవంతా! ఆ నలువేమిచేసెను? పూర్వపున్నెమీరీతినుండ నొకరేమి చేయుగలరు?

వేగ—అట్లనకుము. రాజులు మదించి యుక్తాయుక్తములు కనరు. వారిమాటే వారిది.

చ. తలపరు మంచిచెడ్డల ప్రధానులమాటలు పాటుజేసి యా
వలజననింద గైకొను స్వభావము కన్నులు లేక చారచ
క్షులగు నృపాలురంతమున గూలరె దుర్గతులందుగాన వా
రలకు శుభంబుగల్గదు నిరంతరదుఃఖులు వారిసేవకుల్॥

ఉ. రాజువివేకియైన బ్రజరంజిలు భూమిన నస్యయాఖలుల్
దేజముడంగియుండును సతీమణులెంతయు సంతసంబునన్
రాజిలుచుంద్రు న్యాయముకరంబు తిరంబయి వృద్ధినొందు దు
ర్వ్యోజనమానిచిత్తముల యోగ్యతవీడరు మంత్రిసత్తముల్।

గుణ—ఓయి వెట్టివాఁడా! మన మహారాజుగారు మాత్రమట్టి గ్రుడ్డిరాజులలో జేర్పదగినవారు కారు.

కాంతా—ఓ జననీజనకులారా!

గీ. తల్లిదండ్రులనెపుడు ముదంబుబెంచి
విభునకానంద వారాసి విస్తరించి
వనితలందున వ్రేలును వంపకుండ
మెలఁగనేర్పిన యదియెపో మెలఁతజగతి.

గీ. పుట్టుపెంతనిర్భాగ్యత బొల్చెనొక్క-
యోసహాయము లేకుండ నిట్టిచెఱను

బడసితి నన్ను బోలెడువారు వసుధయందు
గలరె యెట్టువంటి హీనుల కులమునందు.

మ. మగనిం బాసి మనోవ్యథన్ గుడిచి సన్మానంబు జెందంగ లే
క గచాట్లంబడు నన్నువంటియధముల్ యాధ్యోధిభృద్ధారుణిన్
దగ నాలోచన జేయగందు మొకో యాధారంబు లేదయ్యె నా
వగలంబాయు విధానమున్న దె మహిం బ్రారబ్ధమున్ బాపగన్॥

కటా! నావంటి దురదృష్టవంతురాలు లేదు. ఎందునకుం గొఱగాని జన్మ మొంది పలుబాముల నొందుచు గఠినపు కారయందుంపంబడిన వగచుచుండియు నాకాశపాశంబుల ద్రుంపలేకుంటిని, కానిమ్ము సర్వమునకా జగజ్జనకుండే కలండు.

[శక్తివర్మ ప్రవేశించుచు]

శక్తి—[తనలో]

గీ. సుతకుబెండ్లి యొనర్చి పంపితిని నేటి
వరకుగుశలవార్తావళు లరయరావు
కారణం బెద్దియుండెనో కాంచుకాంక్ష
జేసి చనుదెంచినాడను శ్రీప్రగతిని.

లేక లేక కన్న సంతానమగుటచే విడువలేక పంపితిని. ఆడుబిడ్డ లెప్పుడు పరాధీనలుకదా?

గీ. తల్లి ఘోషించుబిడ్డ కుద్వాహమిచ్చు
డేలయంచును సంబంధమెన్న గొప్ప
దిట్టిది మరలరాదంచు పట్టుపట్టి
దిట్టనై ముడిపెట్టితి పట్టినిట్లు.

(ఇటునటు పరికించి కాంతామతినిజూచి) హా! ఇదియేమి యాశ్చర్యము. అనేక దాసదాసీపరివృతవై మహోపచారములం జేయించుకొ

నుచుండు మహారాజ కుమారివగు నాపసిబిడ్డకు బంధనాగార నివాసమేలని? (అనియోనం బ్రవేశించుచున్నారు)

వేగ—(అడ్డగించి) ఆగుమాగుము. మా రాజుగారి యుత్తరవు లేనిదే యేవారికిందు బ్రవేశింపరాదు.

శక్తి—అక్కటా! ఏమిదురవస్థ (భటునితో) నాకుమార్తె ఇందుంటచే జూడవచ్చితిని.

గుణ—అయ్యా! మీరెవరైనను మా ప్రభువుగారి సెలవు పొంది రావలెను.

శక్తి—అయ్యలారా! ఓరిక్కాడుట ధర్మమా! మీబిడ్డలే యిట్టి కష్టములం బొందుచుండ జూచి మీరెట్లు తలంతురు?

వేగ—అయ్యా! మీరేమనినను లోనికిమాత్రము జొరనీయము

శక్తి—హా! మీహృదయములు శిలామయములుగానున్నవి. ప్రకృతిజ్ఞానము లేశమాత్రము మీమనస్సుల నాటినట్లులేదు.

గుణ—అయ్యా! మమ్మునిందించిన లాభమేమి? రాజశాసన మట్టిది.

కాంతా—హా దైవమా!

గీ. కన్నతండ్రిని వీక్షింప గాంక్షయున్న
ననువుకాదయ్యె నిందున మనసుదీర
నే జనింపలేదుపితల కెంచిచూడ
తండ్రిచెఱసాల దుఃఖముతల్లియయ్యె.

భటులారా! నాయందు మీకు దయకలదేని నాతండ్రి నిందురానిండు.

గుణ—తల్లీ! నీ విట్లనజెల్లునా? మేమేమి చేయగలము. ఇది కొంచెము రాజుగారికిదెలిసినచో మా మానప్రాణములు దక్కవు.

శక్తి—హాతనయా! నీకెట్టివిపత్తు సంభవించెనే? అయ్యయ్యో!

సవలావణ్యలావణ్యవతీశిరోమణివై మృదుతల్పంబున మేనుజేర్చి నిరుప మానసుఖాబ్ధి నోలలాడు నీకీవిధి కఠినశిలాతలంబున దేహంబు గందజే యవలసివచ్చెనే తల్లి!

సీ. సురుచిరపరపక్వ శుద్ధోదనంబును
కసిగాట్లనమ లెడి నిను(గునీవు
రమణీయమృదు దుకూలములను మెయిదాల్ప
బెగడొందెముద్దుల బిడ్డవీవు
పలువురుపరిచారికలు సతం బుపచార
మొనరింపవరలెడి తనయవీవు
పట్టుపరుపులపై( బవళింపమృదుశరీ
రముగంద వెతబడు రామవీవు

గీ. నేడుపక్వాన్నమునుదిని నీచమైన
కోకగట్టి యేకతనిల్చి వీ(కజెడగ
కటికఱా నే బండంగ గాంచనయ్యొ
అక్కటా! దైవవంచన నడ్డపశమె.

[భటులనుజూచి] ఓకరుణాకరులారా! నాయందు దయయుంచి [తనలో] ఛీ వీరిని ప్రార్థింపవలసినదేమి? లోనజొర(బడ(గూడదా? "పాలకొఱకు రాతినిమోయు" మనినట్లు నాబిడ్డనుగురించి కొంత శాంతివహించవలెను. (ప్రకాశముగా) నాయనుంగు గూతుంజూడనిండు.

వేగ—రాజోత్తమా! మీయాజ్ఞల నతిక్రమించిన సేవకుల మన్నింతురా!

శక్తి—కష్టనిష్ఠురములను గొంచెము రోూచించవలెను.

వేగ—తినుచున్నయన్నమున మన్నుగొట్టుకొనవలెను.

శక్తి—హా! ఎంతకష్టము.

గీ. హితులమాటలవినకట్టి యెట్టిదేని
బావుకంబునుబొందంగ బాలుపడెనె
నే నదృష్టాంతమైతిని నిశ్చయముగ
సతిహితముజెప్ప చెవిబెట్ట సాహసమున.

హా! కుమారీ! వసంతలక్ష్మీసమానమనోహరీ!

గీ. కన్నకడుపని మదిలోన నెన్నకుండ
తనయుకును బెక్కుకష్టముల్ దార్చినాఁడ
ననువుగానట్టిబాంధవ్య మలముకొనఁగ
బూనునావంటిఖలుజూడఁబోరు వెదకి.

కాంతా—ఓయన్నలార! కడుగారాబమున బెంచి పెద్దజేసి నా యోగక్షేమ మరయ జనుదెంచిన నాప్రియజనకుని దరిఁజేరనీయక యడ్డుచున్నారా? ఇది మీకు దగునా? లోనికి విడిచినంతమాత్రమున నె మీ సేవకధర్మమునకు భంగముకలుగునా? నన్నుజూచియైన లోపలకు రానిండు.

గుణ—ఓతల్లీ! చండశాసనులగు మహారాజుగారు వినిరేని యాస్థానంబునకు వెలియగుదుము.

శక్తి—మీకట్టి భయమక్కరలేదు. ఏదేని విపత్తుకలిగినచో నేను పోషించెదను.

వేగ—తినుచున్నయన్నము బోర్లద్రోసికొనిన ముందు మంచి కూడు లభించునా? ఇవేటిమాటలు? మమ్ము మీరుమాత్రము స్వామిద్రోహులని నిరసింపకుందురా?

గుణ—మీరెంత మహారాజులైనను ద్రవ్యాపేక్షజూపి లోబఱుపనెంతురా?

కాంతా—కటా! ఎట్టి దురదృష్టవతినీ. నాసేవకులకు గూడ

లోకువనై ప్రార్థించుచున్నను నిరాకరింపఁబడుచుంటిని. “మగఁడొల్లకున్న మారియునొల్ల” దనుట నేడు నిజమయినది.

వేగ——[తనలో]! ఈమె దుఃఖముచూడఁగా వజ్రమయమగు నాహృదయము కరఁగి నీరగుచున్నది. ఏమైన కానిమ్ము. (ప్రకాశ)

గీ. తాల్మినీయాజ్ఞ శిరమున దాల్చియెపుడు
నగ్గిఁబడుఁడన్నఁ బడువారి మబ్ధిలోన
గూల్చుఁడనఁగను గూలంగ జాలువార
మాత్మజాతవు నీతండ్రి నరయుమమ్మ.

[అని శక్తివర్మను లోనికి బంపుచున్నాఁడు.

శక్తి——[లోనికిఁజని కూలఁబడి] హాతనయా!

గీ. అభినవశిరీష సుమదామ మర్కకిరణ
జాలమందుంచునట్లు దయాలవంబు
లేక కొట్టునకర్పించి లేనిపోని
వెతలఁ జేసినాఁడను బిడ్డనిన్ను.

సకలభోగంబుల ననుభవింతువని యెంచియుంటినిగాని యిట్లుసుఖహీనురాలవగుదువని తలంపనైతిని.

కాంతా——జనకా! నా యదృష్టంబునకు నీవేమి చేయఁగలవు?

శక్తి——

గీ. ఎట్టిసిరు పెద్దకైనను బుట్టి తేని
కలియొ, గంజియొ త్రావుచు కాలము వెస
గడుపుదువుగద భూకాంతు కాంతవయ్యు
నేమిసౌఖ్యంబునందితి వింటెతల్లి.

అమ్మా! నీవిట్టి కఠినవు చెఱసాల నుంపఁబడుటకు గతంబేమి?

కాంతా——తండ్రీ! ఏమని తెల్పుదును.

శక్తి—అమ్మా! జరిగినదానిని దాపక జెప్పుము, తగిన ప్రతీకార మాలోచింతును.

కాంతా—జనకా! నాయుద్యానవనమందు నొకనాటి మధ్యాహ్నము చెలికత్తెలతో గూడి విహరించుచుంటిని. అట్టిసమయమున నొక మనుజుఁడు చనుదెంచి,

క. ఎండబడి నడిచివచ్చితి
మెండుకొనెందాహభరము మించెడుతాపం
బెండెంనాలుక తడి వే
దండగ మనక్షీరమొసఁగి దగదీర్పదగున్. అని నుడివె.

శక్తి—తర్వాత

కాంతా—కొంటెతనమున నారయుగ్గిన యల్లనేరేడిపండును గోసి యిసుకపై వైచితిని.

శక్తి—పిదప

కాంతా—ఆయన పండుతీసి యూదబోవుచుండ "ఊదకు ఊదకు బావా నీ మీసము కమిలెను బావా" అని హేళనముగా పలికితిని.

శక్తి—[తనలో]

గీ. ఎట్టివల్మీకమందున నెట్టిసర్ప
ముండునో యెట్టిజడుఁడు ప్రచండుడగునొ
ఎట్టితృణమెట్టిమందున కేరుపడెనొ
తెలియలేరు మూఢమతుల్ సుధీరులట్లు.

ఆయన విక్రమార్క సార్వభౌముఁడు కాఁబోలును. ఆయుమహా పములు రాజ్యపాలనయు నాఱుమాసములు భూసంచారమును జేయుచుండునని వినికి (ప్రకా) పిమ్మట.

కాంతా—అంత నాతఁడు కన్నులెఱ్ఱజేసి,

చ॥ అతిథియనంగ విష్ణుఁడని యాడెదు వాక్యము రిత్తపోవఁగా
నతిశయమందుచుంటివి నృపాత్మజ పోయల వేశ్యభామపో
సఁగి; యెటులైననిన్ను జనసమ్మతి పెండిలియాడి కారలో
గుతుకము మీరనుంచెదను కోమలి జీవము లుండునంతకున్.

అనియెను. అంత నేనును,

ఆ॥ వె॥ నిన్నె పెండ్లియాడి నీయందె పుత్త్రిని
గాంచియబ్బురంబు గాంచునట్లు
జేయు దానవట్టి చేతలుగావయ్యె
నిజము నమ్ము నమ్ము నెమ్మనమున.

అనిపలికితిని

శక్తి—(తనలో) ఇఁక నేమున్నది ఆయనయే యీవిక్రమార్క మహారాజు. నేవెళ్లి పదంబులపైఁబడి ప్రార్థించుదునా? (తర్కించి) ఏమనునో? క్షత్రియానర్హమగు పనిచేయునా? యుద్ధమొనర్చి గెల్తుమన్న దేవీప్రసాద సంప్రాప్త రాజ్యభార ధురంధరుఁడు. కానిమ్ము దీనికి మారోపాయమే పన్నవలెను. నా కుమారి యేమనునో (ప్రకాశ) తర్వాత తర్వాత.

కాంతా—తరువాత నాకీ బంధనాగారమే ప్రాప్తించినది. (నిట్టూర్పుపుచ్చి) హా జనకా! నావిపత్తుగాంచి యూరకుండుటకన్న యేదియేని పిడుగొకటి బడఁదోయరాదా? అందుఁ బడిపోయెదను.

శక్తి—(గ్రహించి) అమ్మా! విచారింపకుము. నీకష్టముగట్టెక్కు కాలము సమీపించుచున్నది.

గుణ—వేగవంతా! ఈయమ్మ గుండము తీయుమనుచున్నది అందు బడిపోవును కాఁబోలు. ప్రాణహత్య జేసికొనినచో మన ప్రాణము లూడును. కాన జాగ్రత్తగా జూచుచుండవలెను.

వేగ—మన కాపులోనున్న వారు మఱియొకవిధముగా జరుపు టకు శక్యముకాదే? బ్రిహ్మదేవునకైన వీలుకానప్పుడు మనుష్యమాత్రులకా సాధ్యము. ఏల వెఱ్ఱి పడెదవు ?

గుణ—ప్రాణము విసిగినప్పుడు స్త్రీలెంతపనికైన సాహసింతురు

వేగ—చాలు నీవన్నియు సత్యకాలపుమాటలు. ఇప్పుడు మగని దాసునిగా జేసికొనకున్న జాలును.

కాంతా—తండ్రీ! నన్నుఁబోలు నిర్భాగ్యురాల నేలగల్పించితివి? సర్వసన్నద్ధడవయ్యు విక్తునిపగిది యుండదగునే?

శక్తి—అమ్మా! వగవకుము. నీకెన్నండును విపత్తు గలుగదు. సర్వము దైవాధీనము. భరింపరాని దుఃఖము కలిగినప్పుడే ధైర్యమవలంబించవలయును. వగల బొగులకుము. నీకేదియో మంచి దారి దొఱక వచ్చును.

కాంతా—తండ్రీ! నాకధోమార్గమే శరణు. ఇంతకన్న వేఱు త్రోవలేదు.

శక్తి—[తనలో] అదోమార్గమనుచున్నది. అనగా నేలయడుగునుండి త్రోవగల్పింపుమనుచున్నది. [ప్రకా] దైవము నీయందుండి నచో మించితెఱవు దొఱకవచ్చును. సన్మార్గులకాపదలు కొండలవలె నున్నను తుదకు మంచిగనే పరిణమించును.

కాంతా—అవన్నియుకల్ల నావంటి యదృష్టహీనురాలికి మాత్రము శుభము కలుగనేకలుగదు. కారాగారంబునందుండి సదాదుఃఖాక్రాంత స్వాంతనగుటచే వివేచనాశక్తి లేకున్నది. ఎప్పటికైన బ్రిదికి బైటంబడుట తటస్థించునా? అట్టిభాగ్యము కలుగునా? మన్నాథుండు మన్నించునా? నావిపత్తు పోగొట్టువారుందురా? హా!

శక్తి—(తనలో) ఇందుండి యుపాయమాలోచించుట కష్ట మనియు, ఏదోయొక మార్గముపన్ని తన్నావలకు జేర్పుమనియుఁ జెప్పు చున్నది [ప్రకా] తల్లీ! ఇంద్రునంతటివాఁడు కాలవైపరీత్యము చే నజ్ఞాత మొనరింప వలసివచ్చెను. చంద్రిమతి విప్రగృహంబున దాసి కావలసివచ్చెను. దమయంతి మిక్కిలి కష్టపడినది ద్రౌపది యనేక చిక్కుల నొందినది. కావున నీకుఁగూడ కొంతకాలమీయిక్కట్టుప్రాప్త మైనది. ముందుదారి మంచిగనేయుండి బైటపడవచ్చును. చక్కని యుక్తిచే మనవచ్చును. అమ్మా! వెళ్ళివచ్చెదను.

కాంతా—జనకా! ఏమాలోచించెదవు? నీకుగూడ నాయందు దయలేదా? నాగతియింతేనా? నాకేదియుమంచిదారిలేదా? వెళ్లిరమ్మ

శక్తి—[పరిక్రమించుచు] నాపట్టణమునుండి యిక్కడికి సురంగము త్రవ్వించి దీనిని తీసికొని వెళ్ళెదను. దీనిపోలికగల బొమ్మ నొక దానిని గల్పించియుందుంచెదను అటుపైని జరుగువిధాన మాలోచించ వచ్చును. [నిష్క్రమించును]

కాంతా—[విచారముతో] అయ్యయో! నాప్రియమైన తండ్రి కూడ వెళ్ళిపోయెను. ఏమిసేతును

గీ దైవబలమున్నవారలు తలచుకార్య
వితతికనుమాయనంతలో విస్తరిల్లు
దైవము ననుకూలముయిన దలఁచుకార్య
వితతికనుమాయునంతలో విపదగూర్చు.

[తనలో] నాతండ్రికి మదీయాభిప్రాయ మెఱింగించితిని. గ్ర హించెనో లేదో తెలియకున్నది.

వేగ—గుణవంతా! ఆజన్మాంతమీమెకి శిక్షవిధించినట్లే మన లగూడ నీటకట్టిపడవైచిరే? మార్పులుఁ కలుగవా?

గుణ—సుఖముగా గుడిచికూర్చుండలేక గొంతెమ్మకోరికల గోరుచుంటివా? ఇందునీకేమి కష్టమున్నది? ఏనెలజీతమా నెలకు సరిగా బుచ్చుకొనుచు నిటకూర్చుండుట కష్టముతోచినపుడు దివారాత్రము లెడతెగక బనులలోఁబెట్టి త్రోయినప్పుడు సౌఖ్యముండునా?

వేగ—ముసలివాఁడవు, నీవేపనిజేయలేవు, నాబోటి వయసు వాండ్రూరక కూర్చుండుటకన్న కష్టముకాదా?

గుణ—"పిల్లకాకేమి తెలియునురా యుండేలదెబ్బ" లను నట్లు చిన్నవాఁడ వగుటచే గష్టసుఖములు తెలియక నిట్లుపలుకు చుంటివి. నాయనా! ఇప్పటికే బది సంవత్సరములనుండి యీసంస్థానములో గొలువుచేయుచుంటిని, కాని, ఎన్నఁడు పల్లెత్తుమాట యనిపించుకొని యెఱుంగను. మొన్న మంత్రిగారియింటికిఁ బనిమీఁద వెళ్ళితినిగదా? రామ, రామ, వినలేకపోతిని, నానాచివాట్లు గోపాలుని బెట్టుచుండిరి. అవి వినిన నాయొడలు చచ్చిపోయినది.

వేగ—దానికేమి, కాని, నేరమున్నప్పుడు నిందించుట సహజము మనముమాటలసందడిని కాలమును మఱచితిమి అటుచూడుము.

సీ॥ అంధకారంబులు కుంభినిబగులంగ
నార్చుచు నిలుసేరె నాలమంద
వ్యాయామవిశ్రాంతి వహియింపనీడముల్
చేరిఱెక్కార్చె పక్షివ్రజంబు
జననియన్నంబుఁ జనువునలాలించి
భుజియింత్రు శిశువులు మోదమునను
సాంధ్యకృత్యముదీర్ప సరగున నదికేగి
యర్ఘ్యమిచ్చెను రవికగ్రకులము

గీ. వనజమిత్త్రుఁడు పగలిటి పనులదీర్చి
శ్రమను బాపంగ నెంచి వారాశి జేరి
వృద్ధభర్త నూతన భార్య బ్రేమ జూచు
[తనలో] నట్లు రక్తమని బూని గ్రుంకంగఁదొడఁగె.

గుణ—వీఁడు సాయంకాలవర్ణనామిషచే నన్నెట్టులెత్తిపొడుచుచున్నాఁడో? నాకు బడుచుభార్యకలదనియు, దానినొక నిముషమైన వదలనేరననియు జెప్పుచున్నాఁడు. [పైకి]

గీ. రాగయాభార్య మగనిపరాకుదీర
నెత్తిపైఁ గొట్ట నెత్తురు నీటుదొరగ
ముఖముపై బారునట్టుల బుష్కరమణి
రక్తమంబూనె వర్ణింప శక్తికలదె.

వేగ—(తనలో) ఏమీ వీనియుడుకుబోతుతనము. "ముసలి వాఁడు పడుచుభార్యను ప్రేమించునట్లు"ని యుపమింపఁగాదన్న ధిక్కే పించితినవి తలఁచి "నాభార్యనన్ను గొట్టుచున్న" దని యెత్తిపొడుచుచున్నాఁడు. వీనికి దగినట్లుత్తరమిచ్చెదను. (ప్రకా)

ఆ. వె. భార్య యశ్వజాతి బాముఁలఁబడఁజేయు
నెట్లు వశము జేయు నెంచువాఁడ
ననుచు జింతనొందు నతివృద్ధుఁడగు భర్త
విధము సూర్యుఁడెలమి విడచెగాంతి.

గుణ—(తనలో) "నాభార్య కుఱ్ఱతనమున జిక్కులు పెట్టుచున్న" దని యూహించుచున్నాఁడు.

చ. తమియనుజారకాంత మరుతాపభరంబున జారుఁజేర శీ
లము చెడునంచు భీతినిగలంగిన చిత్తమున న్నసుంగు కుది

దములురచించినట్టి గగనంబను నీలపుకూలమూంచు చం
దమునబ్రకాశమయ్యె దివిదారలు చీఁకటులుం గ్రమంబునన్.

వేగ—(తనలో) నేనొక చెడిపెను దెచ్చుకొంటినని ఎట్లు దెప్పుచున్నాఁడో? “కలహమునగాని కులముదేల” దనునట్లు మాలో మేము వివాదపడుట మంచిదికాదు. [ప్రకా] నీకుభోజనపువేళదాఁటుచున్నది. నీవు వెళ్ళిరమ్ము.

గుణ—(తనలో) వీఁడు నామాటలకు సిగ్గుపడినట్లున్నది. ఒకరిని నొప్పించుట తప్పుకదా? వీనిని క్షమార్పణవేఁడుకొనెదను. [ప్రకా] నాయనా! కుఱ్ఱవాఁడవు. ఆకలిబాధకుఁ దాళలేవు. నీవు ముందుగ వెళ్ళిరమ్ము. నే నేదేని యంటినా యది నల్లమందు తిక్కగాని మరియొకటి కాదు.

వేగ—(తనలో) పశ్చాత్తాపమొందినట్లున్నాఁడు. [ప్రకా] పెద్దవారు సర్వత్రపూజింపఁదగినవారు. నేనువచ్చునప్పుడే భుజించితిని. నీవు వెళ్ళిరమ్ము.

గుణ—సరే. (అని నిష్క్రమించును.)

కాంతా—హా! నాబ్రదుకెంతహీనమైనది. నేనోచిననోము ఫల మెట్టితీరున ఫలించెను? [రాత్రియగుటచూచి] నేడు నాకనుకూల రీతి గాన్పించుచున్నది. ఏమన,

ఆ. వె. మబ్బుగ్రమ్మురాత్రి మస్కరులకు బ్రీతి
నింపుచుండె దారలెల్లమినుకు
మినుకుమనుట వీడెమేళవించెను పెను
జీఁకటెల్ల దిశలఁ దీఁకయొడల.

(లోన ధ్వనియగును.)

[విని] ఈచప్పుడెక్కడనుండి బయలుదేరినదో యరసెద. [అని పరిక్రమించుచు సురంగముచూచి తనలో] సరి, నేననినదంతయు నా తొందర్పాటున పూర్తిచేసెను. సింహము నిద్రించినతర్వాత నిందుండి వెడలెదను. (ప్రకా) ఓరీ! వేగవంతా!

వేగ—అమ్మా! ఏమి సెలవు.

కాంతా—ఏమి ... నిను నేపిలచితినా?

వేగ—ఏమి, ఈమె యిట్లాడుచున్నది. [ప్రకా] అమ్మా! ఇప్పుడే పిలచితిరి.

కాంతా—అయ్యయ్యో! మోసమువచ్చెనే ఎంత తెలివితక్కువ పనిచేసితిని. (ప్రకా) ఓరీ! నీపనియేమియు లేదు. నీస్థానమున జాగ్రత్తగా నుండుము. [తనలో] నాథా! నన్నాకట భాధించి నాసాహసము జూపునటుల జేయుచుంటివి. నేనేమిచేయగలను. ఇందు నాతప్పు లేశమైన లేదు. నీపదములే శరణు

క. ముక్తికి మోదంబున కను
రక్తికి గౌరవమునకును రచణికి నెపుడున్
భక్తికి యుక్తికి శక్తికి
సక్తంబౌనట్టినీదు చరణము లెంతున్. మఱియు,

ఉ. నేరములేదు నాయెడల నీదగు నాజ్ఞను బూనియుండుటన్
గారనువాయగావలసె కార్యముచక్కనొనర్ప నెంచి భూ
మీరమణా! కుమోదము సమీహితమయ్యెడు కన్నకాంతలం
దూతమునందునుంచుటయె దోషమటంచు దలంతు లేకనన్.

[వైకి] ఓరీ!
వేగ—అమ్మా!

కాంతా—గుణవంతుఁడు రాగానే—[అని యూరకుండును.]

వేగ—గుణవంతుఁడు రాగాఁనే ఏమి చేయుమని సెలవు?

కాంతా—(తనలో) ప్రమాదము సంభవించు లాగున్నది. [ప్రకా] వాఁడు రాగానే నాకు కనఁబడుమని చెప్పుము.

వేగ—చిత్తము. దేవీ! చిత్తము. అదుగో గుణవంతుఁడు.

గుణ—(ప్రవేశించి వేగవంతునితో) ఏమి విశేషములు.

వేగ—ఏమియు లేవు. నిన్ను అమ్మగారు పిలిచినారు.

గుణ—అమ్మా! ఏమి సెలవు?

కాంతా—[తనలో] వీనితో నా ప్రయత్నము చెప్పుదునా? ఏమి నావెఱ్ఱి. [ప్రకాశ] ఏమియు లేదు. ఊరకనే యడిగితిని. మీమీ స్థానంబులకు బోయి పండుకొనుడు.

భటులు—దేవీ! చిత్తము. (అని పండుకొనుచున్నారు.)

కాంతా—(కొంతసేపుండి) ఆహా! ఏమి వీరిగుఱ్ఱు. అప్పుడే నిద్ర బట్టినది. ఔనౌను వారికేమివిచారము. నాబోటి విచారభారభరిత హృదయకు నిద్ర కడుదూరము. నాయీప్రయత్నము దైవమెట్లు నెరవేర్చునో తెలియదు. పురుషకారమున్నమీఁదటగదా దైవసాయము. కావున నెట్లయిన బ్రయత్నింపక తప్పదు. (అని యిటునటు పరిక్రమించి తన్నుబోలియున్న బొమ్మను దీసిచూచుచు)

గీ. ఒనర నారూపునొందిన యుజ్వలాంగి
నాదు యత్నంబుదీర్ప సన్నద్ధమైతి
విందు కపటంబులెల్ల పొందకుండ
నిల్పెదవొబొమ్మ! పోయెద నెనరునిల్పు.

(అని బొమ్మను తనపక్కపైఁ బరుండఁబెట్టి నిండుగా ముసుఁగువైచి) దీని నిక్కడనుంచితిని. నేను వెళ్ళినపిదప నెవ్వరైన దీని దాకిన చో గపటము వెల్లడికాక మానదు. (అని యోజించి ఒక కమ్మవ్రాసి పక్కను బడవైచి భర్త నుద్దేశించి) మనోహరా! నాయందు దప్పు కలదేని మన్నింపుము. [భటులను జూచి] నన్నుంచి యీభటుల కేహానియు రాకుండును గాత.

[అని సురంగమార్గమున నిష్క్రమించును.]

ఇది ద్వితీయాంకము.





# కాంతామతి.

## తృతీయాంకము.

—:౦:—

రంగము — చెరసాలద్వారము.

[వేగవంతుఁడు, గుణవంతుఁడునను నిరువురు భటులు ప్రవేశింతురు.]

గుణ — వేగవంతా! అటు చూడుము,

గీ. లోకవిజ్ఞానహీన బాల్యమని మనంబు
నందు విలసిల్లుజ్ఞానంబు చందముగను
దారలెల్ల దివంబున దాఁగుచుండె
స్వీయతేజంబు విడనాడి విన్ననగుచు.

వేగ — తారలు తెరలుటే కాదు.

ఉ. రాతిరివేళఛాయ యనురాగమునన్ హరిచందనంబుచే
చేతముదృప్తిఁ జేయ గడుశీఘ్రగతిన్ దిననాథుఁడాట దా
బ్రాతి నిశాంకముల్గదుగ బ్రాక్షలరాశినిముగ్గివేచు న
ట్లాతతరక్తదీప్తిజలజాప్తుఁడు దూర్పునదోఁచె వింతగన్.

ఏమిది చూచుచుండగనే ప్రొద్దెక్కినది. ప్రతివానియాయువు నిట్లే తూటువడిన రోటికుండలోని నీటివలె తరిగి పోవుచుండును కాఁబోలు

గుణ—ఏవేళ కేదివచ్చునో యెవరు చెప్పఁగలరు.

వేగ—చెప్పుట కేమున్నది. అటు దిలకింపుము. బంగారు పన్నైరముల దివ్యాస్త్రముంగొని మదనమాలిని వచ్చుచున్నది.

చ. ఘుమఘుమ వాసనల్ దిశలకున్ వెదజల్లుచు నిష్టతర్పణం
బు మిగుల నాసికందనువు పొల్పెసరారు ప్రశస్త్రశస్త్రశా
కములుం పసింపి గిండిగొనుకంబున దాల్చి వికాశ మొప్ప వ
చ్చు మరుని బాణమో యనఁగ సొంపువహించి విలాసవైఖరిన్.

(పైనిఁ జెప్పఁబడిన ప్రకారము దివ్యాస్త్రముగొని మదనమాలిని ప్రవేశించుచున్నది.)

మద—[తనలో] ఈమె సుగుణములు చూచి మనస్సున మిక్కిలి చింతిల్లుచు నెప్పటికైన భూనాయకున కీమెయం దాదరము కలుగునేమో యని యోర్చియుంటిని. పెక్కుయత్నములు చేసియు గార్యసాఫల్యము గాంచనైతిని ఎన్ని బాధలకైన సహించు నీమె మనోదార్ఢ్యము ప్రశంసార్హముకదా? [భటులనుచూచి చిరునవ్వునవ్వుచు లోన బ్రవేశించి పరిక్రమించుచు పైకి] ఈమె నేడు చాలప్రొద్దెక్కువరకు బండుకొనియున్నదే (ముసుఁగుతీసి) అమ్మా! అమ్మా! లెండు, లెండు! భోజనపువేళ మించిపోవుచున్నది. [అనిపిలిచి పలుకకుండుటచే శంకించి పరిశీలించిచూచి ప్రాణము పోయినట్లూహించి విస్మయవిచారములతో] ఎంతపనిజరిగినది భటులారా! కొంపమునిఁగినది.

వేగ—గుణ—[తొందరతో] ఏమేమి?

మద—ఇంక నేమున్నది. (ఏడ్చుచు) అమ్మగారు!

ఇరువురు—ఏమి అమ్మగారి కేమి? వేగ జెప్పుము.

మద—నేను చెప్పలేనమ్మయ్యో [అని యేడ్చును.]

ఇరు—[తొందరతో] ఏమి చెప్పతేవు! కులాసాగా నున్నారా!

మద—నాకు తెలియదయ్యా, (అని యేడ్చును)

ఇరు—[దగ్గరకు జేరి పరిశీలించి] ఇంకేమున్నది. అమ్మగారు [అని యేడ్చుచున్నారు.)

మద—(ఏడ్చును) ఎంతమంచిదానవు నాతల్లి! నీకీదుర్మరణమే విధివచ్చెనమ్మా!

ఇరు—[కొంచెము తేరి] మదనచూలినీ, ఏమవకుము. ఇపుడు చేయవలసినపని యేమి ?

మద—ఏమున్నదో నాకు తెలియదు.

గుణ—[విచారముతో] మనకింక మానప్రాణములు దక్కవు. అమ్మా! మాకేమిదారి కల్పించితివి.

సీ. బత్తెంబునందున భాగంబుగొనువారు
కరిసులై చలిసాలగాచువారు
పనులందువిశ్రాంతి బడసీయనివారు
చేతిసొమ్మెల్లను జేదువారు
దోషికాదనువటంచుఁ దొడరిగొట్టెడువారు
కొట్టియామీదను దిట్టువారు
పైడిహరించెనీ పాపియనెడువారు
దానిగొనివిడువ బూనువారు
గీ. నిట్టిదుష్టాధిపత్యంబు నేహ్యముగద
వారి వ్రాలెనీసాధ్విని కారలోన
బాధపెట్టుట లేదుగా పాపులమయి
యేలయీచెట్టవచ్చె నహోనమునను.

ఎట్టి యపఖ్యాతి పాలైతిమి ?

వేగ — అపఖ్యాతిమాటటుంచుము ముందు జీవములున్నగదా? అయ్యయ్యో! దివాణమునందు నూకలిక మనకు లేవు కాబోలు.

మద — అమ్మా! ఎంతవిపదఁగూర్చితివి? అన్నములో విషమేది యో పెట్టిచంపితినని ముందుగా నాతలగొట్టింతురు నేనేమని వేడు కొందును.

సీ. బానిసీలకు దొరసానివై నిభక్తి
యుండదందురు నిజమగును విదమిన్న
యేనుదలఁపను ప్రభ్వికి యుష్టశ్రుక్య
మహహా! నాబ్రదుకున కేమి హానికలదొ?
గీ. ఏమిసేతునుదైవ మీమెడనుక్రూరుఁ
డై వృథాపవాదము బడనాజ్ఞయిడెనో
నృపతిమన్నింప నాపాలకృపను గలఁడొ
చావనుదుటను వాకితనుజంపినాఁడొ.

తల్లీ! నీవొకతప్పు గతించి పదుగురకు హాని ఘటస్థింపఁజేసితివి.

గుణా — సీ. మర్యాదగోల్పోయి మహినిజీవించుట
కన్నను పాపంబు కలదెజగతి
వేగ — మనుజేశునకు గ్రోధమునుగల్గ జేసియా
మీఁదనుబ్రాణాల మెలపవశమె
మదన — రాజురక్షించిన బ్రజలోనఁదలయెత్తి
యేకిరియు మెలగంగ నెంచఁగలము
గుణా — కలవిధంబంతయు కల్లకేకను దెల్పి
క్షమియింప వేడుటేసాధకంబు
వేగ — గీ. ఎట్టులచక్కని యోచన నెన్ని కాని
నమ్ము కాపాడదగినట్టి మాన్యబుద్ధి

మదన—వరయు నీయుపకారము మరవగలమె
తోడుపడవయ్యె కృపతోడ వేడుచుంటి.

గుణ—నాకొకయుక్తి తోచుచున్నది.

వేగ—అదేది.

మద—త్వరగ జెప్పుము.

గుణ—రాజుగారి కెఱింగింతము

మద—ఎవరు వెళ్ళి చెప్పగలరు. ఓయమ్మో! నేను వెళ్లిచెప్పలేనే

గుణ—నేను ముసలివాఁడను కదా భయముచే వణకుచునే మాటకేమాటచెప్పి గొంతుకమీఁదకు దెత్తునో.

వేగ—[తనలో] ఇఁకదిక్కేది? నానెత్తినిబడినది. (ప్రకా) మీ రిక్కడనుండుడు. నేరాజుగారిని దీసికొనివచ్చెదను.

గుణ—వేగ రమ్మా.

వేగ—ఇదిగో యిప్పుడే వచ్చెదను. (నిష్క్రమించి విక్రమార్క మహారాజుతోఁ బ్రవేశించును)

విక్ర—ఏమి రాణి? రాత్రివరకు కుశలముగా నున్నదనుచుంటివి. ఇంతలో నాకస్మికముగా మరణించుట కేమికారణము? మీయందేదో లోటుకలదు.

వేగ—మహాప్రభువా? ఒకటిరెండు సారులు పరాకుమాటలాడి నారు.

విక్ర—అప్పుడే నాతో జెప్పవలసినది

వేగ—ప్రభువా! అదియొక్కటే మాలోటు.

విక్ర—(తనలో) అట్టి మనోహరాకార లభించినప్పుడూరక వెళ్లినై చెడితిని.

సీ. కొద్దిహేతువులకె మదిగొప్పతప్పి
సములుగాగనెంచి నృపులుదయలుగారు
వారిహృదయముల్ కౄరముల్ వసుధయందు
రాజనామమహంకారబీజముకద.

[పరిక్రమించుచు శవమునుగాంచి ప్రకాశముగా] హా! మనోహారిణీ! నిరుపమాన లావణ్యతారుణ్యగణ్యా! కుసుమకోమల కోమలాంగి! నీకీవిధిని కష్టకష్టమరణము గల్పించిన యీమూర్ఖున కేమి గతి చెప్పితివి? అయ్యయ్యో! ఎట్టి దుర్మార్గుఁడను.

చ. నవనవనీరజంబు వదనంబు ప్రకాశముతప్పినైల్యమున్
నవనవగాంచె క్రొలలిత చక్షుయుగంబునిమీలితంబునై
ప్రవిమలకాంతి బాసె కటా! భర్మనిరాకరణంబు దేహమీ
భువికొఱగాక యగ్ని కిడఁబాల్పువహించె నే మోహనాంగిరో.

(దగ్గఱఁజేరి) హా మధురవాణి! నే జేసిన యపరాధంబునకై నన్ను జూడకుంటివా?

సీ. వట్టియభిమానమును బూని కట్టుకొన్న
దానిగవరాఁడ కెంతయుఁ బాపమొంద
జేసియుంటినిపుడు నీ జేరు రంభ
పోల్కె నాపొత్తు నీకెట్టిమొద వొసంగె.

[ప్రక్కను కూర్చుండి] సుదతీ! నా పెన్నిధానమా! నాభాగ్యరాశీ!
చ. నిగనిగలాడుచున్నిగుల నీటుధరించెడు చెక్కుటద్దముల్
వగలదురంగవించుముఖ పద్మవిరోధియు హీనకాంతియుం
జిగిబిగిమించు మోవిపసిచెల్వము చిత్రము సందు నొక్కఁడుంగా
మగువ! దలంపరాని సుఖమగ్నుని జేయు వెక్కుఁభోగములతా

సుందరీ! నీయందంబు చందంబు గాంచియు గనులకుఁ బొరలుగ్రమ్మి దురహంకారమగ్నుఁడనై నిన్ను విడిచితినని కోపించితివా? నాయపరాధంబు సైరింపుము. కన్నులు తెరచి చూడుము. ఒకపలుకు పలుకుము. అయ్యయ్యో!

సీ. బంగారురంగారు పట్టుదుకూలముల్
గుట్టలుబడ గనుగొనవదేమి?
నవరత్నమండిత నవ్యభూషణములు
గుట్టలుబడె గనుగొనవదేమి?
దాసదాసీజన తండబులరు దెంచి
కుతుకంబునను గనుగొనవదేమి?
నీముద్దు రాచిల్క నిల్చియున్నది చెంత
కుతుకంబునను గనుగొనవదేమి?

గీ. రాగహీనుండు భర్తని రాగనుండు
చూడ నేటికి నశ్వరచోద్యములని
కోపమూనుచు నీక్షింపఁ గోరవొకొ
చిత్తమర్పింతు కృపమాని చెల్లుఁజూడ

వేగ—(మొదలగువారు విచారము సూచించుచున్నారు)

విక్ర—సుధాంశుముఖీ! ఎట్టికష్టంబువేళ సాహసము కలిసికొంటి మోకాని యన్యోన్యప్రేమ గలిగియుండియు నెయ్యడము మాత్రము నిల్చినది కాదు. అక్కటా నీవేమి చేతువు పెక్కురీతుల చెప్పితిని నేనె దుర్మార్గుఁడనై నీహితవువినక నిర్బంధించితిని. ఆబెంగనిను గృంగవేసెను. సర్వవిధములఁ జెడితిని. ఛి! సాధ్వీంజంపుకొనినవాని కీయునురుతోఁబ నేమి

గుణ—మహారాజా! సర్వధర్మజ్ఞులరగు దేవరకు మాకేదారి జూపెదరు? ఆత్మహత్య పాతకములలోనెల్ల ఘోరపాతకముకదా? మిమ్ముగాంచి తత్సాహసము మానుటొప్పును.

విక్ర—(వినిపించుకొనక) హానుకుమారి

చ. విడచితి వేమనోవిభుని వేసట చేపరిచారికావళిన్
విడచితి వేసుంహాసలను వీడితివేళంకశారికాదులన్
విడచితి వేసతంబు శెత వేగు మనుంటివటంచుజీవమున్
విడచితివీవుసర్వమును వీడఁడుసీపతినిన్ను నెంటుటల్.

(అని శోకోద్రేకముచే గాఁగిలించుకొనఁబోయి ప్రక్కనుబడి యున్న చీటిం గాంచి) ఇదేమి? ఇచ్చట చీటిగన్పించుచున్నదేఁ? ఇందేమున్నదో చదివిచూచెదను "శ్రీమదనంతాధినాథుఁ డును" నిన్ను విడచిన తర్వాత నధినాథత్వమెక్కడఁ? అనాథుఁడనుము "గర్వితారాతిభూభృత్కులిశాయుధులును" నీవు చెంత లేనప్పుడా మాటయున్న "నిర్వక్రవిక్రమక్రమితవిక్రమార్క సార్వభౌముని పాదపద్మముల సన్నిధికి" సార్వభౌముననెందును వనవాస మేశరణు "తావకాక్షీణకటాక్ష వీక్షాణామృతాస్వాదితానంద సందోహ భంభరాయమాన మానసయగు కాంతామతి సమస్కారములు" అయ్యయో! చావనున్నప్పుడుకూడ వినయవిధేయతలఁజూపవలెనా? ఎట్టియుత్తమకులోత్పన్నవు? ఎట్టిగుణనిధివి. అట్టిరత్నమవగు నీ వెట్టినిర్భాగ్యునకు దక్కుదువు? "నాథా" ఇంకెక్కడి నాథుఁడు" సంసారికము జీవములున్నంతవఱకెగద "తావకోదగ్రశోకాగ్నిధావల మున కుశలభంబనగు" నిజమట్లుల నేరైయెతివి. "నేఁజేయు విజ్ఞప్తి సావధానముగ నవలోకింపఁ గోరెద" ఇఁక నేమిచేసెదను. సానకాళము కావలసినంత యబ్బినది. బ్రతికినన్ని దినములు నిన్ను సుఖపెట్టలేకపోయితినిగాని యిప్పుడానందముతో సావధాన మూనెదను. "దేవా" అయ్యో! ఈవినయ సౌశీల్యము గర్భనిర్భేదకరముగదా? "నిష్కారణముగా నన్నీకీతిన నిర్బంధమున నుంచినందునకై కలుగు నఘము మీకుఁజెందక నాకధోగతిని బ్రాప్తింపఁ జేయునుగాత" హాముద్దుగుమ్మా! బంగారుబొమ్మా! చిన్నికొమ్మా!

చ. నరకమునందు గూలిన ఘనంబుగ స్వర్గమందునున్న నా
తరమణితో బనేమనుచు గూళతనంబును జెందవయ్యయో!
సరసుడు గాని భర్తకయి చాలగఁ జొక్కెదు నీకృపామతిన్
దరమె నుతింప సుందరసుధాకర నిర్జిత శోభితాననా?.

గీ. కారణంచినవానిపై గరుణబూని
నీమృదుగుణంబు బ్రకటించి నేడు విమల
కీర్తిఁగందితివీవెన్న కేవలంబు
సాధ్వివనుచును జెందంబు సాక్ష్యమిచ్చె.

అయ్యయో! నేనెట్టినిందితకార్య మొనర్చితిని. ఎట్టిజననిందకుఁ బాత్రుఁడనైతిని. "నాథా! పతికన్నముందుగ సతిమరణించిన నుత్తమగతికేగుదురని పెద్దలాడుదురు. అట్టిసుకృతము ఫలించినందుకై సంతసించుచుంటిని." నీవెప్పుడు సుకృతవంతురాలవె.

ఉ. నాదగుభాగ్యలక్ష్మి తగునాయమృతంపు నిధానమాకడుం
బేదను జేసిచిత్తమునఁ బ్రేముడివీడిదివంబు జేరితో
మేదురబుద్ధిశాలిని యమేయగుణాఢ్య భవత్సుకృత్యనే
వాడును లేకగా చెమగవా! ననుగా చెనెపాపినోటచేన్.

గీ. కాంత! కడుపుణ్యవాటచే గాంచగల్గె
స్వర్గభోగంబుసతమును భావ్యమగుచు
నీకుభర్తనయ్యు ధరనునిశ్చయముగ
దుఃఖభారంబుభరియించి దోగవలసె.

"నాకోర్కె నేటివరకు జెల్లింపకుంటిరి" ఔను. అట్టియదృష్టము పట్టినదికాదు. "నేడైన జెల్లింతురో లేదో యనుసంశయము. బాధించుచున్నది" అయ్యో! సంశయమువలదు. నీముద్దు చెల్లించని మూర్ఖుఁడని సందేహపడకుము. నిజముగ జెల్లింతును. ముమ్మాటికి సత్యముగా జెల్లింతును. నిష్ఠూరమువలదు. అక్కటా! ఎంతప్రారబ్ధము తటస్థించెను.

చ. సతినగభాలటంచు జనసంఘము పల్కుటవ్యర్థమౌనొ కో
మతిదలపోయ నెంత యనుమానము జెందితి లోకమందు భూ
పతిపతియై గేహమున భార్యయె వానికి నెక్కుడౌగదా?
క్షితిపయి నీయభీప్సితము శీఘ్రము మొనర్తువచింపనొప్పగున్.

«ఐనను వెలిసేయుచుంటిని అదేమన నాజీవంబు బాసినం దను వాత నెట్లున్న నల్లైచితి బెట్టవలయును గాని యొకరైన నన్నంటరాదు." హా! ఇంకేమున్నది. సుందరవదన చంద్రమండల మస్తమించినది. దానితో నాజీవితములు గూడ నాకర్షించినది. చెలీ! తక్కువతపము చేసి యెక్కువఫలితము రమ్మనినవచ్చునా? «ఎవరేని సాహసించి యంటినచో వారివంశము నిర్మూలమగును" సతీ! అట్టిసాహసు లెవరుందురు? వాడీతడౌ కండె నీవు లేనినాకు నాకు నంశాంకూరమేది? శ్లో॥ పితా హతా త్రిభువన మంధకారం । మాతాహతా జిహ్వారసాలభిన్నం । భ్రాతాహతా దక్షిణబాహుఖండం । భార్యాహతా ఛత్రకపాలచిన్నం ॥ అనునట్లు భార్యలోటు త్వరలో దీరునందు వేమో? అట్లైన్నటికిని రాదు. ఆకలిగొనినవానికిఁ దొలిముద్దయందలిరుచి మలిముద్దయందుండునా? అయ్యయో! సుందరీ! ఎంతకష్టము తెచ్చిపెట్టితివి, నీనేర్పు, నీచకచక, నీబిగువు, నీనగవు, నీనీటు, నీగోటు, నీమాట నీపాట, నీయాట, నీతేట, నీతెలివి. నీవగ నీసొగసు, నొక్కపూటలో వ్యర్థమయ్యెకదా? కట్టా కాలవైపరీత్యము. "ఇట్లువ్రాసితినని బలవన్మరణము నొందితినని యెంతురేమో?" అక్కటా! నీవంత మూర్ఖురాలవా? "అట్లు జరుగ లేదు జీవస్వాభావికమైన మృతియే సంభవించినది." అయ్యో! చెవుల కాలిన నారసములు గ్రుచ్చినట్లున్నదే? "శిరోబాధయే దీనికిఁ గారణము" అయ్యయో! కార్యముమించకుండ దెలిసినచో దగుజాగ్రత్త పడుదునుగదా? తుదకౌషధసేవ లేకయే మృతికి స్వాధీనమైతివా? మన సంస్థానములో నినుబ్రతికింపఁజాలు వైద్యుఁడొకడైన లేకుండెనే? "ఒకా

నొకవేళ జీవములున్న బునర్దర్శనమగుగాత" ఇకను నాశలగల్పించు చుంటివా? చూచుటమాత్ర మెన్నఁడును జరుగదు. "భవద్విధేయు రాలు, కాంతామతి." ఆహా! ఏమి నామ మాధుర్యము. ఎంతగ్రోలి నను తనివితీరకున్నదే? ఎవరైన భార్యను కఠిననిర్బంధమునుంచి జంపి వగ యేడ్వ యేడ్చునని వెక్కిరింతురు. నాయట్టిపాపు లెభూలోకమున బుట్టిబోరు. పుట్టినవారిలో లేరు. నేనొక్కఁడనే పాపాత్ముఁడను. (కన్ను లను దిలకించి)

ఉ. శ్రీలకుదావులై కలువ రేకులగల్మినిగ్రిందుసేసి పె
న్నీలకుబంధులై భ్రమర మిత్రములై ఘనఖంజరీట స
న్నీలమనోహరంబులయి నిర్మలసంతతభాష్పవల్లులై
మేలగునీకనుంగవను మించుముదంబునజూడగల్గునే.

హా! సుకుమారి! సుమకోమల కోమలంబగు దేహలతికయెట్లు శుష్కించి పోయినది.

ఉ. రాజగుచంద్రుఁడాశివు శిరంబుననిల్చియు దోషియయ్యెను
త్తేజమెలర్పనంబరగతింబరతెంచు దినేశ్వరుండు దా
దేజముడంగెడుం బహుగతింధరనెంతటి వారలైన రే
రాజముఖీ! కళంకమతిరంబయియుండును రాజవాచ్యులన్.

నాపాదిత్యము నన్నే యనుభవింపఁ జేసినది.

వేగ—(మొదలగువారు విచారము సూచింతురు)

విక్ర—సుందరీ! ఇఁక నెక్కడిసుందరి? నాయాశలన్నియు మంట గలపిపోయినది.

చ. జననమెమృత్యుహేతువు నిజంబుగలోకమునందుభీకరం
బనుచుదలంతురజ్ఞులు, మహామదమందురుత ప్రాజ్ఞులీవిధం
బును దలపోయసౌఖ్యముల బొందుగణించుటకంబెమృత్యువే
ఘనమనితోఁచుజీవులకు గల్గెడిబాధలమాపుచుంటచేఁ.

ఆహా! నీవంటిమనోహరాంగిం గూడు బెన్నిజన్మము లెత్తినను సంభవింపదు, ఇంకవిచారించిన లాభము లేదు. చేయివిడచిన దానికై చింతించుట గతజలసేతుబంధనము. ముందుకార్యంబుల జూడవలెను.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

---

# కాంతామతి.

:o:

## చతుర్థాంకము.



రంగము-సభాభవనము.

(రాజమంత్రులు, కొందఱు సభాసదులు-భటులు.)

విక్ర—అమాత్యవరా!

మా. సజ్జనబృందము సౌఖ్యముఁ జెందుచు సంతసమొందు నెసంతతమున్!

మంత్రి—మహారాజా!

ము॥ జ్జగముల్ తమయాజ్ఞను మీరగఁ జొప్పునెభూతలనాథమణీ!

విక్ర—ప్రధానశేఖరా!

పజ్జమెలంగెడివైరులపై నెడబాయకకన్నులనుంపదగున్!

మంత్రి—ప్రభువతంసమా!

రజ్జులుగాపుసుడీ పరరాజులురాజ్యములందుననుండి రెపో॥

విక్ర—సీ. పులులచే పశుహానిబొందు కాపులుసృక్కి

యార్తినొందకనుండ నరయవలయు

ఖలులచే మానినీతిలకంబులకుగీడు

పొరయకుండగ వేగనరయవలయు

బలులచే ననదలు బాధలువడకుండ
దగుకీతిగాపాడ దలఁపవలయు
న్యాయమన్యాయమున నశించిపోవక
నుండ వీక్షింపుచునుండవలయు

గీ. క్షామచోరాది బాధలు జనులకెపుడు
కలుగకుండు నుపాయము దలఁపవలయు
నాడ నేటికి రామరాజ్యంబు వోలె
పుడమిజనములు మేలుల బొందవలయు.

మంత్రి—మహాప్రభూ! అవక్రవిక్రమ పరాక్రమరత్నులగు దేవరవారిశాసనము న్యాయావలంబులకు మల్లెపువ్వుల చెండుగదా? దురాత్ములకు ఫిరంగిగుండుగదా? వైరిహృదయంబులకు నలగుండుగదా? చోరులకు బత్తెమునింపుగదా? తమభుజాదండకల్ప శాకయుద్ధులకు చకోరక చంద్రోదయముగదా? దేవా?

ఉ. దేవరపాలనామహిమ దీనులకెల్లను కల్పకంబునై
యీవసుధాతలంబు వనకోనప్రశస్తిని గాంచెనన్న నో
భూవరగొప్పగాదు తగభూతగణంబులెవశ్యులై సదా
గావుమటంచు నిల్చియరితాపులు నోట విచిత్రమయ్యెడున్.

కం. భేతాళుని వశుజేయఁగ
నేతాదృశులకునుగాక నితరులవశమే?
భూతలమున పార్థివవర
ఖ్యాతిగ రాజ్యంబునేలు ఘనుఁడవుగానన్.

విక్ర—మంత్రీ! నన్నూరక పొగడకుము. మత్పూర్వికుల దృష్టవశమున నట్లులభించినది.

[ద్వారపాలుఁడు ప్రవేశించి చేతులు జోడించి]

ద్వార — మహాప్రభూ! వింధ్యప్రాంతమునుండి కిరాతుఁడొ కఁడు తమ దర్శనమునకై జనుదెంచెను. వానిశరీరమంతయు రక్తమ యమై యుండెను. కనుకీసునివలె గన్పించుచుండెను.

విక్ర — [మంత్రివైపు జూచుచున్నాడు]

మంత్రి — త్వరగఁ బ్రవేశపెట్టుము.

ద్వార — చిత్తము [అనినిష్క్రమించి తిరుగ కిరాతునితోఁ బ్రవేశించి] వారే ప్రభువువారు, దర్శింపుము.

కిరా — [సాష్టాంగపడిలేచి]

శా. సామీ సెప్పగవాయిరాదునుకముల్ సత్తెంబునల్లారె దే
వా మానెత్తి నిరాసినాఁడో గురుతింపంరాని కష్టాల మా
సేమంబుల్ పొలముల్ పశూత్కరములుఁ జీంాలపాలయ్యెగా
మేమేరీతిని జీవముల్ నిలుపుగామింతుంగ దే దేవరా?

దేవా? మీపాదాలాన, మేము నానావితాలజీవాలతో వేగ లేక దూరానునుండి రాలేక ప్రాణాలనిలుపలేకున్నాము.

విక్ర — పులిందా! నీవాయాసము వాపుకొనుము.

కిరా — మారాజా! మామేలుగోరురాజా! నల్లనిమాటాడి పీడ నల్లార్చినావు. మాబాములు పగవారికేనివలదు.

విక్ర — నీయాపదగట్టెక్కినది, భయపడకుము, వివరింపుము.

(లోనకలకలమువిని మంత్రివైపు చూచుచున్నాఁడు)

మంత్రి — ఎవఁడురా అక్కడ.

ద్వార — (ప్రవేశించి) దేవా! ఏమిసెలవు.

మంత్రి — ఆకలకలము విచారించిరమ్ము.

ద్వార — (నిష్క్రమించి తిరిగి ప్రవేశించి) దేవా! వింధ్యపర్వ త ప్రాంతపు కిరాతుఁడట. తమ దర్శనమునకై వచ్చి తొందరపడు చున్నాడు.

విక్ర—[మంత్రివైపు చూచుచున్నాడు.]

మంత్రి—త్వరగా ప్రవేశ పెట్టుము.

ద్వార—(వెళ్లి కాలూసను కట్లుకట్టుకొని కుంటుచున్న కిరాతునితో ప్రవేశించి) వారే ప్రభువారు.

కిరా—(సాష్టాంగపడఁబోయి పడలేక చేతులు జోడించి)దొరా! బొబ్బలమెగము నాకాలుపీకినది. ప్రాణాలు గుడగుడలాడుచున్నవి. బాదబాద, సెప్పలేను.

విక్ర—నీబాధ నేటితో హరించినది భయపడకుము.

కిరా—ఏనూపుసూసెదవ్రా సామీ! కాలభైరీడు దగ్గఱుంటచే ప్రాణ మాగినది. మాగూడెపువారందఱు పులివాతబడి యీల్గినారు కొందరి గాయాలు సెప్పరాదు.

(లోన పెద్ద కలకలము.)

విక్ర—మంత్రీ! వారినందఱిని రప్పింపుము.

మంత్రి—మహాప్రసాదము. ఎవరక్కడ.

ద్వార—[ప్రవేశించి] దేవా! ఏమి సెలవు,

మంత్రి—ద్వారముదగ్గరనున్న యాసదల నందఱినిందు ప్రవేశ పెట్టుము.

ద్వార—దేవరయాజ్ఞ [నిష్క్రమించి పలువిధముల కట్లుపట్లు కలశరీరములుగల ఇరువురు కిరాతులతో, ప్రవేశించి· వారే మహా రాజుగారు

కిరా—మాపాపములో జడల మెకాలను సూసి బీతుకుడిసి యీడకురా నివేటిసింగాలు బాబూ! (అనిమూర్ఛబోవును.)

విక్ర—అయ్యో ! ఎంతకష్టము. సింహాసనమునందలి సింహములంగాంచి యడవిలోని నిజమైన వెడదమోము మెకములని వెఱచి మూర్ఛనందినాడు. (తక్కిన వారింజూచి) వానిని బ్రబోధింపుడు

చ-కి——ఏమిపబువుసామీ ! నచ్చి మీసేరువకురా మాజీవా లూడ్చు జీవాలనిల్పితివి దొరా !

రా-మం——(మొదలైనవారు వారియవివేకమునకు నవ్వుదురు)

ద్వి-కి——(చ-కిరాతునితో) ఇంకేమిరాజురా. మన బాముల సూడనివాఁడు.

చ-కి——అదేటికూత. బుద్దిమళ్లించుకో. మారాజువింటే కోవ లో పానాలూడడమునున్న. ఈడనిజము.

ప్ర-కి——(తృతీయునితో) ఓరి ! వెఱ్ఱి ! బొమ్మలుగాని వానికి పానము లేదు భయము లేదు లే. లే.

తృ-కి——(మూర్ఛనుండిలేచి) ఓరబ్బా ! గుడ్లు లిమిసూస్తుం దిరా? బొమ్మలుకావురా బాబూ! సీంబోతు సేవసూస్తిగాని ఇంత బయపెట్టలేదు. (వణకుచున్నాఁడు)

విక్ర——(వాని యనాగరికతకు నవ్వుచు) ఓరీ! నీకేమియు భీతి లేదు. కిరాతులారా! మీబన్నంబుల నుడువుడు.

ప్ర-కి——సెప్పడమునకేమున్నది సామీ ! మమ్మేలినవాఁడా! పులులెగబడినవి. పందులు మందలు మందలై పొలాలవెంటఁ బడినవి. అవెక్కడవో కాని నడగొండలవలె తరుము బోయిన తిరుగఁబడును.

ద్వి-కి——అల్లారుముద్దుగా సూసిన ఆబెయ్యను చియ్యబట్టి రుంయిమని యొకంగను నోటగవ్వకొని చివ్వన సారలమొకమెత్తుకొని పోయినది.

విక్ర——అయ్యయో! ఎంతకష్టము.

తృ-కి——అవేమి జంతువులోకాని నేలయీని నక్లైడగన్నసూడ వచ్చును. మందుబీతి మందే లేదు. గందుగదా రెండేపుకూనల నొక సివంగి నిమేసములో పేగుల పోగులవలె సూడలాగినది.

విక్ర——అమాత్యా! పూర్వము విశ్వామిత్ర సృష్టివలె నేడుద్భ

వించలేరుగదా? వీరిమాటలు కడువిచిత్రములుగ నున్నవి.

చ-కి — దేవా! మీపాదాలతోడు. అబద్దమాడిన మాజిమ్మ డినట్టే.

విక్ర — నేనువచ్చి జంతువులజంపి మిమ్ము రక్షించెదను.

ప్ర-కి — ఎల్లిరాక సుస్త్రీసేసేవు జేడా!

ద్వి-కి — ఓరి! బాబుగారంటె కాని కొంపమున్నదా?

తృ-కి — బాబుదగ్గఱ బయమేటిరా?

చ-కి — ఓరి! తందనాల జడదారులుంటేరా మనకు.

ప్రి-కి — ఓరి కిరాతులార! మిమ్ములరక్షించి యాపదల బ్రో వ్రోలుటకిదే బద్ధకంకణుఁడనైతి. వగవకుడు.

తృ-కి — (తనలో) నీసులవ్రాలె నోరీయంటాడు. మాగూడెం లో "దోరా" అనకపోతే బుఱ్ఱగరెస్తా. ఇదేంగతి. ఈళ్ళెపాళెంగొప్ప గొట్టారు. (మఱియొకని చెవిలో చెప్పుచున్నాఁడు)

చ-కి — (తిరిగి యూరకుండుమని సౌజ్ఞ చేయుచున్నాఁడు)

ద్వి-కి — (తనలో) బద్దకంకణమేటి? సేతికి కంకణాంగాని. బద్ద కు కంకణంగడతారా. (అనితన అభిప్రాయము తృతీయునితోఁజెప్పును)

తృ-కి — (ద్వితీయునితో) ఓరి నీఅమాయకం కాల. ఉండల బద్దకు తాడుండదంట్రా అదే కడతాడోసి.

ప్ర-కి — మాపానాల మీసేతికిచ్చి నమ్మితిమిసామీ! మీసి త్తము. మాబాగ్గెము.

విక్ర — మీకాసందేహ మక్కఱలేదు. మీరందఱు నిందేవిశ్ర మింపుడు మీకు పలయు సదుపాయములను జేయించెదను.

గీ. ప్రజల బాగోగులరయని పార్థివుండు
రాత్మభూషలదాల్చెడి రాజవరుఁడు

గంగిరెద్దును బోలు చుక్కౌతలమున
న్వర్థజీవులుగా రెవో యరయ నెందు.

ప్ర—(ద్వితీయునితో) ఓరి! బాబుగారిసిత్తము మెత్తన నూసితివా? మనబాదలు సూడలేక వెంబడించినాడు. ఇఁక గుట్టలుగుట్టలుగా మాంసము మెక్కి లొట్టలు వేయుచు లొట్టలునిండ జీలుగుకల్లుంచుకొని జాతరలు సేసెదరా! నాసామిరంగా.

తృ—(చ-కి-తో) ఓరి! నా పెట్ట నీళ్లోసుకుని సారలమొకమును మాంసము సవిసూడ వేశినది. దానిమనసు దీరినట్లే.

ద్వి. కి—(ప్ర-కి-తో) నా నేస్తకాడు బాపనయ్య కాలునొప్పికి పులిసముగుగోరి మఱిమఱి వేడినాఁడు అప్పుడోదుగలను. అప్పుడో సవలము. సద్ది ఎప్పుడిచ్చితే అప్పుడేపుచ్చుకొని పనుపు కాపాడెను. ఇఁక సిద్దిలతో నప్పగించగలను.

చ—(తృ-కి-తో) పులిగోళ్లు దెయ్యాలబాదకు విరుగుడని సంకలోగోళ్లు రొండుచంపాదించి తెమ్మని ఒకమ్మ సెప్పినది. నేను గోరుకు రొండువరాలంటే అట్లేఅన్నది. నాల్లువరాలు నేతికి వచ్చినట్లె.

ప్ర—నేను పందిగున్నల గుది గుచ్చెదరా?
ద్వి—సిరతల గొరత వేసెదరా?
తృ—దున్నలకాల దున్నెదరా?
చ—మన్నులమన్ను సేసెదరా?
ప్ర—కణుసులకడుపు సించెదరా?
ద్వి—గోరల మరలించెదరా?
తృ—కరుల దరిమెదరా?

వి(క—ఓకిరాతులారా! బడలిక దీర్చుకొనబోండు) నేటికిక్కొలువు చాలింతము. [తనలో] హా మనోహరీ! పవమానసూనుని శరీరమునందు వ్యాపించిన శ్రీరామాంకమువలె నెంతకాలమైనను నాహృ

దయమును మాత్రము బాయజాలవుసుమా? నీకు కృతఘ్నుని యందలి యుపకారము వలె నాయందు బ్రేమ లేకపోయెను. హా! ఎట్టిగతి.

[అందఱు నిష్క్రమింతురు]

ఇది చతుర్థాంకము.

---

# కాంతామతి.

—:o:—

## పంచమాంకము.

రంగము—అడవి.

[విక్రమార్కుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విక్ర—ఆహా! ఆమాయలేడి నన్నెంతదూర మీడ్చి తెచ్చినది.

గీ. పవనవేగంబు బాణజనంబు సూర్య
రథతురంగ మంబులసత్వరంబు హృదయ
శీఘ్రమీ హరిణమునకు జెందబోలు
కాకయుండినదృగ్వీధి గడచు టెట్లు

ఏమి యీవనరామణీయకము.

సీ. ఇంద్రాయుధద్యుతులిందు గన్పడువింత
నట్టువపుల్గుల నాట్యవేళ
కలశపాథోరాశి పొలుపువహించెడు
కలహంసలవిహార కలనవేళ
గాఢాంధతమసంబు గలిగించు గుహలునా
యీరముల్ గడఁపగలింటివేళ
వటశాఖపైనిల్చి భ్రమగొల్పుశుకములు
గాంచ ముదంబును బెంచువేళ,

గీ॥ పుష్పవల్లులు స్వీయపుష్పాడినిజల్లి
నేత్రపర్వంబొనర్చెడు జితశివకార
వనరమాకాంత శృంగారమును నుతింప
దరమె వేయిజిహ్వలవాల్చు నురగపతికి.

పచ్చని మొలకలు రత్నకంబళము పరచినట్లల్లారు ముద్దుగానుండెను. వికృతచేష్ట లొనర్చుచు వానరసముదయంబు చెట్లపై దుముకుచున్నవి. ఈపుష్పవాటీరము సొగసేమని పొగడుదును, ఏమి యీమా కందముచందము. ఆగండుతుమ్మెద ఝుంకారము ఆసెల యేటియొడ్డున గూర్చుండిన ప్రాణము లేచివచ్చునట్లున్నది. (అనిపరిక్రమించుచు) హా! కరిణీయాన! ఇట్టివింత నీకుఁగూడ గనఁబరచిన నెంత సంతోషింతు వోకదా? నాకట్టిభాగ్య మెన్నిదినములకు సంభవించును. (అని సెలయేటియొడ్డున గూర్చుండును)

కాంతా—(ప్రవేశించి తనలో) ఇక్కడ నేదియోధ్వని గలుగుచున్నది చెపుమా! ఇందెవ్వరుకలరు? ఆపొదరింటిలోని యిందు శిలావేదికపై వీణీయనుంచి వచ్చితిని మన్నాథుడీ కాననమునకు బలుమారు మృగయావిరాధక మరుగుదెంచుట వాడుకయని విని యిందు నివసించితిని. ఎప్పటికైన నాకోర్కె ఫలించునా? (అని పరిక్రమించుచు విక్రమార్కుని జూచి) ఆఁ! ఏమి? నాపూర్వపుణ్య ఫలితము. నాకనుల కానందసంధాయకుఁడగు నాహృదయేశ్వరుఁడే యీయన. దైవేచ్ఛ యెట్లుండునో తెలియదు ఒకవేళ నాపంతమీడేరు కాలము సమీపించినదేమో? ఎట్లీయన నాకు వశ్యుఁడగును? (ఆలోచించి) "శిశుర్వేత్తి పశుర్వేత్తి, వెత్తిగాన రసంఫణిః" అనునట్లు సర్వజీవులకు సంగీతమే మోహజనకము. కావున మోహనరాగాలాపంబునకు మోహించి వెంటబడు సారంగంబువోలె నీనృపకుంజరుని సంగీతమునుబాడియే రప్పించుకొనెదను. (అని పొదరింటఁ బ్రవేశించి వీణపై కొన్ని గీతముల

ను బాడుచున్నది.)

విక్ర—(వినుట అభినయించి) ఎక్కడనో సంగీతము వినఁబడు చున్నది. అరసెదనుగాక. (అని లేచి పరిక్రమించుచుఁ గాంతామణిని జూచి) ఈపొదరింట నెవతెయో మందయాన కన్పడుచున్నది. నేనొక కవినైనచో బ్రత్యవయవమునను వేలకొలఁది పద్యభూషణము లిడి యుందును.

ఉ॥ కంతుని బాసి పంతమున గానజరించు రతీవ కాంగి యో
సంతతమున్న హరిన్వీడచి సంచరణంబొనరించునట్టి శ్రీ
కాంతయొ? వేడ్క మైభువన గణ్యవినోదవిశేషదర్శన
స్వాంతమున న్విహారమిట సల్పెడుశంకరు ముద్దుగుమ్మయో?

ఉ॥ కన్నులగొల్వబోయి కరకంజము లెత్తి విధాతుఁడుంచి దా
గన్నసతీయుచో రేకొకటి రమ్యత సందున నిల్చునట్లు లీ
యన్నులమిన్నకన్నుగవ యద్దిర! చేరలమించెమించె సం
పన్నతశ్రీరుచిగా విమలపంకజసంతతి వింతవింతగన్.

ఎట్లుపల్కరించు తెరవు? నీవు క్షేమంబుగనుంటివా! యందునా కుఖపరిచయమైన లేదే. కాదు కాదు. దాహమని యడిగెదను. ఏమను టకు దోచకున్నది. (మదనబాధ సూచించుచు)

గీ. విల్లునమ్ములుదాల్చి నేవీరుఁడేని
యెదుటనిల్చి యుద్ధమొనర్చునింతె కాని
నిన్నుబోలుచుచాటున నిల్చిశరము
వైచిభాధింపబడిది యేటుపౌరుషంబు.

కాంతా—(తనలో) నన్ను వంగివంగి చూడ ప్రారంభించెను. మదనదేవుండించుక దయజూచినట్లున్నది. ఎట్లీయనను నాకడకురప్పించు కొందును సాధనము గాన్పింపకున్నదే. వినని ట్లు చేసిచూచెదను. (భ్రమరబాధ నభినయించుచు పైకి) అయ్యయో! దుష్టమధుకరమా!

యనదల బాధించినగాని నీపౌరుషము వెల్లడికాదా?

విక్ర—(తనలో) ,,రోగిపాలు గోరె వైద్యుండు పాలుద్రావు] మనునట్లుకాక తాళీయముగ దరిజేరుసమయము సమీపించినది [ప్రకా ఆఁ! దురాత్మా! ఆగుమాగుము. (అని సమీపించుచున్నాఁడు)

విక్ర—సుందరీ! ఆదుష్టుఁడెటుజనెను?

కాంతా—మహాత్మా! నీధనుర్బాణములనుగాంచి మనంబున భ్రమించి యెందోఁజనెను.

విక్ర—రోలంబాలకా! నీవెనతవు?

కాంతా—ఒంటిపాటునఁ గంటబడిన మదనవతిని బల్కరించు నెపమాయెఁడి.

విక్ర—[తనలో] ఇది నాయభిప్రాయమును జక్కగ గ్రహించినది. మంచిజాణ. ఎటులదీనిని లోబరచుకొనుట, [ప్రకా] హరిణాక్షీ! హరిణము వెంటబడి దారితెలియక తత్తరించునాకు పురము జేరు దారింజూపి పుణ్యంబునందుము.

కాంతా—మానవనాయకా! దానియడుగుల జాడనుబట్టి వెళ్ళుము.

విక్ర—వెళ్ళిన మండలంబును జేరుదునా?

కాంతా—అచటి రాజునునిర్జించిన జేరవచ్చును.

విక్ర—జయించుట నపాయము.

కాంతా—ఉపాయములేకున్న నపాయము సంభవించునుగదా?

విక్ర—దానికి నిన్నడ్డుపెట్టరాదా? సుదతీ!

కాంతా—నన్నడ్డునెట్టుట కెట్టివాఁడు కావలయును.

విక్ర—దానికి నేతగనా?

కాంతా—(ఇంచుక కోపముతో) చాలుచాలు

విక్ర—పద్మనేత్రీ.

చ॥ పదములుగందు వారవనవాసము జేయుచు నొంటినుండనీ
హృదయము భీతిజెందదొకో? యెన్నగగానన మించు ఘోర స
త్వాళిము మందమునఁగలుగు వాస మొకప్పు డసహ్యరాముగా నా
సదనమునందునిల్చి సుఖసంపదలందుము కౌతుకంబునన్.

గీ॥ ఒంటిపాటున కాపురముండ నేల
జవ్వనంబెల్ల వృథగాక నిచ్చలమున
మరుఁడు గ్రూరుఁడు వలనై యిమానసంబు
నీడ్వ సాగె నీవద్దవే యిందువదన! [ప్రక్కకు జేరును]

కాంతా—(తనలో) వలబడ్డమృగము వేటకాని పాలయినట్లు మారపాశబద్ధుఁడగు నీనృపశేఖరుఁడు నాపాలఁబడినాఁడు (పైకి) ఓయీ! నీవెవరవు? సంతోషంబున విహరించునను బోటిబోటుల బల్కరించి తక్షేలన భంగంబొనరింపదగునా? దయచేయుము.

విక్ర—లతాంగీ! ఏను విక్రమార్కమహీశుండను నీదాసుఁడను.

కాంతా—రాజా అల్పురాలనగు నాదాసుఁడవైన నేమిఫలము

విక్ర—పల్లవపాణీ!

ఉ. శ్రావకనేత్ర సౌజ్ఞలు సదామదిజ్ఞానము లెంచుటొండు సం
భావనతోడ గౌగిటను వాసముజేయుట రెండు వేడ్క కె
మ్మోవి సుధారసంబును బ్రమోదమునన్ రుచిజూడమూడునై
భావజకేళిఁగూడి యపవర్గసుఖంబుల నొందనాల్గగు.

ఇఁక నెన్నియో లాభములు కలవు.

కాంతా—[తనలో] ఇన్నిదినంబులకు నాతపంబు ఫలించినది. వీనులీసుధాప్రవర్షంబున నోలలాడుట కెట్టిపుణ్యంబును జేసికొనినదొ? (ప్రకా) నృపా! చాలుచాలు. నీమాటలగట్టిపెట్టి నీదారినిబొమ్ము.

విక్ర—పికవాణీ!

చిత్రపద దారినిజూపవె వేగం • గోరితి నిన్నవగావం
గ్వారమునుండదయుండై • ఘోరశరంబుల నాటెన్
కాంతా నారిని గాంచినతోడం • గోరట ధర్మమెనీకున్నీ
భూరమణుండని గర్వం • బారయ జెందగ మేలే
విక్ర చానరో! వేడెద
కాంతా చాల్ చాల్
విక్ర దీనునిగావవె
కాంతా మేల్ మేల్
విక్ర మానిని దానములందున్
కాంతా బూను నిదానమె బాగా

రాజా! తమవంటి ప్రభువతంసులు నాబోటి నీచకాంతను గోర మేర కాదు.

విక్ర—పుండరీకవదనా!

ఉ. నీచమనంగ నెద్దితరుణీ! ఘనవారిధరంబు వేణిగా
గాంచ ముచెక్కుగా నమముకంధర మార్గముగా సుధాంశుడున్
నీచపుబానిసీడుగ ననిందితహేమువిశేష కాంతిమై
దోచెమశోభగా వెలయు దొయ్యలి నీచనుదోయి నీచమా?

శ్రీవృత్తము— రా। జా। వా। క్షీ।

సుకాంతివృత్తము— దయావతి! భయాత్ముడన్ వయంబునన్ దయుంగనన్

వృత్తము— ఓరామా గారింపన్ సారంబా బీరంబా

వసుమతివృత్తము— తగునాసుదతీ! పగవాడనెనీ బిగికౌగిట నన్ దగజేర్పగదే.

కాంతా—(తనలో) హృదయమా పొంగకుము. (ప్రకా)

స్త్రీవృత్తము. నారిం గోరం జీరం మేరా

వృత్తము—నృపకులతిలకా కపటపుపలుకుల్ త్రిపగొనిపలుకం
గపటము వెలియగా

మానిని—మానుము మానుము మానవనాయక! మానిని
తో గవగూడుతలం

విక్ర—పోనలినాక్షిరో! దుష్టమరుండిటు లుజ్వలబాణము
నాటెనెదన్

కాంతా—సూనశరుండెద నాటినసృక్కుచు సోలెదప్రాబల
మేడజనెన్

విక్ర—పీనపయోధర! నీమరుజోచ్చితి నేమనునుంపవె
బాహులతన్

ఎంత వేడిన నీకింత యేని దయవొడమకున్నయది. నన్నేలిపట్ట మ
హిషివై నారాజ్యంబు సర్వంబు నీవ బాలింపుము. ఇఁక వెతలముంపకుము

కాంతా—(తనలో) ఏమి నాయదృష్టము. భూచంక్రం బవక్రవి
క్రమంబున నేలు నృపపురందరుఁడు నన్నేలుకొనుమని వేడుచున్నాడు.
అతనిజాయననగు నాకింతకన్న భాగ్యంబేమికలదు. ఇప్పటికి నన్నెఱుఁగ
నట్లేయున్నది. కొంతబిగువుచేసి వినోదించెదను. ఓధైర్యమా! కొంత
కాలము నీప్రభావము నాయందునిల్పుము ఓక్రీడాదేవతా నిన్నెవరు
పిలిచినారు. నాహృదయ ప్రాసాదమును ముట్టడించుటకు నీకేమియధి
కారమున్నది? చాలుచాలు. నీకుపదివేల వందనములు ఓహృదయమా
విరోధులవశయయ్యెదవా? అట్లుగాకుము. నాపక్షమునిల్చి వైరుల నెది
రింపుము, (ప్రకా) పార్థివకుంజరా!

గీ॥ న్యాయమార్గానధర నేలు నవనిపాల
కాంతనుంగాంచినంత నె కలయువశమె
దుష్టులనుదోలి శిష్టులకష్టముడుపఁ
దగును గాని యన్యాయపు దారితగదు.

పరాధీననుగోం భావ్యమా?

విక్ర—కృపాధీనుని గోవకుండుట యన్యాయమా?

కాంతా—ఇట్లనదగునా?

విక్ర—విడువదగునా?

కాంతా—బలిమితగునా?

విక్ర—మూర్ఖత తగునా?

కాంతా—ఇది సరసమా!

విక్ర—ఇది వినోదమా!

కాంతా—ఇది విపరీతమా!

విక్ర—ఏలుకోనవా?

కాంతా—సమయము లేదా?

విక్ర—నీదయకై యెదురు చూచుచుంటిని.

కాంతా—రాజా! ఆడుదానని లోకువ జేయుట తగదుసుమా నాప్రాపకునకు దెలిసినచో జీవనమునకు మోసమురాగలదు.

విక్ర—మదగజయానా! నీప్రాపకుని గూర్చి తిరిగి యోచింప నేల. నారాజ్యముకన్న మిన్నగనోసంగు వారెవరు? సర్వము నీయధీనము చేసెదను. నన్నుదయజూడకున్న నిఁక దిక్కెవ్వరు? సుమసమసుకుమారీ !

ఉ. కన్నులు పుండరీకములు గాత్రముపుష్పసమాన కోమలం
చెన్నగనాననంబది నవీనసరోజము మోలితేనెం కుం
సన్నిహితాప్తజాతము కచఃప్రసరంబు సుధాసఖంబు లా
యున్నలమిన్న నీహృదయమక్కట వజ్రమయంబు జూడగన్.

కాంతా—రాజబిడౌజా!

చ. ఒరునియధీనతన్ నిలిచియుండిన కాంతను కాముకేళికిన్
సరగునబిల్వగా తగునె చాలునుచాలును బిల్వబల్కగా

సరసముమీరి వచ్చెమదిజాలి వహించెడు నావిభుండు స
త్వరముగ నేగు మాపెదవిబాటిన బృద్ధియు దాటెడుంజుమీ

విక్ర—(తనలో)

గీ॥ సతికినిష్టంబుగా నట్టిసరణియేని
చిరునగవుతోడ బ్రత్యుక్తి చెప్పనేల
స్త్రీలచిత్తంబు దెలియంగ శేషునకును
వశముగాదన్న నాకెట్లు వశము తెలియ

ఉ॥ పయ్యెదకొంగుజార్చి ప్రతిభాషలనాడెడు బాహుమూలముం
జయ్యనగానుపింపగను జారుపయంటను జక్కదిద్దులో
నెయ్యముజూపురను నిర్మలరాగము గల్గియుండకే
తొయ్యలియిన్నిపోకడలతో చదుపోవగ నాకుజూడగన్.

ఉ॥ కోపము లేదుమాటలను కూలముచూపుప్రశాంతి మోహముం
జూపెడుచేష్టక్రీడ బహుసుందరియియ్యది నాతపఃఫలం
బీపడతింగనంబరచెనే క్రియపీనినిగూడు వాడనో
తాపనుమీరఁజూచెనుగదా సుమబాణశరాగ్ని పెంపునన్

(ప్రకాశముగా) సఖియా!

క॥ వెలయాలనంచు బల్కెదు
వెలయింతనిదెల్పరాదె వెలనిడికొందున్
తులలలేదు నీయొయారము
తిలకింపక రెండుకనులు దీరవురమణీ

కాంతా — రాజా! వెలయాలి పొందుగణించుట గౌరవమునకు భంగకరము వెలయాలికిఁ బ్రేమ లేదను వాక్యము మీ రెఱుంగనిది కాదు,

విక్ర—సుందరీ! అట్లనకుము,

సీ. కిన్నరేశ్వరసుతుండెన్నగ రంభతో
మేనకనుగలయుంగ దగ్గనే గౌరవంబు
గాధేయుఁడా (దేవకాంతను) గూడంగ
మునులలోవిఖ్యాతి బోయెనోకో
పురుత్సుఁడూర్వ సీభోగంబుగాంచిన
సార్వభౌమత్వంబు జరుగలేదొ
స్వర్వేశ్యతో గూడు పరమతపస్వియా
మాండకర్ణిమహీ మమాసెనోకో
గీ. మహినిసంతటి ఘనులె పోమదపతులకు
జిక్కి జార నపరులలెక్కయేల
యేలకుండుట నాయమూ రోలతాంగి
అర్థియననా స్త్రియనుట మహాగుణంబె

నావైదయురాదు. రానినాడు నాకీరాజ్యముతోఁ బనేమి. ఇందే ప్రతినై యుండెదను. అందునను.

సీ. ఘనసారకలితమా గంధంపుబూతయె
బొదలెడుభసితంపు పూతగాగ.
నవరత్నమండిత నవ్యదుకూలంబు
వరలెడువల్కలాంబరముగాగ
నురుము త్రియపుపేరు మానవకజపించుచు
రుద్రాక్షమాలికా రూఢిగాగ
తావకాపాంగ వితావినోదకరనం
తృప్తియె భ్రూమధ్యదృష్టిగాక
గీ॥ విమలభవదీయసౌజ్ఞ హృత్కమలరాస
మోగ్యమంత్రరాజము గాగమోగినగుచు

నిం దెవసియింత్తు దయ లేదె యిందువదన
భీరశరణాగతత్రాణ ధీరసదన
కాంతా—రాజోత్తమా!

ఉ॥ వైపయిమేని కాంతిగని భావముగాంచగలేక మోహసం
పాపితచిత్తులై ధనము వారక యిచ్చి సహాస్యవీక్షము తే
జోపరిరక్షితాంగబల సుందరమెంతయు వ్యర్థపుచ్చిసం
తాపముజెందియున్ విటులుడాయుటమానరు వేశ్యపొందుకై
నామనవినివిని తనివినిగని హృదయమును మరలింపుకొనుఁడు
పికరి—మత్తేభగామినీ!

గీ॥ ఎన్నివిధముల వేడిన నించుకంత
దయయు రాకుండె నేమందు దైవగతికి
కొద్ది నోములునోచియు గొప్పఫలము
గోరనెటువచ్చు చెప్పుమా సారసాక్షి

సీ॥ కల్యాణి దయమీరగాంచ కున్ననునాదు
వైభవమంతయు వ్యర్థముజుమ
శ్రీకారకర్ణ! సుశ్రీకటాక్షంబు నా
పయి లేనిచోఁ గల్మివ్యర్థముఁజుమ
మోహనాంగిరో నీదు పొందు లేకున్నచో
యవ్వనంబంతయు వ్యర్థముజుమ
సారంగనేత్రి! హృత్సారసంబువకింపు
పలుకమిశ్రోత్రముల్ వ్యర్థముజుమ

గీ॥ వెలయువను రాగమాలికల్ విస్తరిల్ల
వరయుకుండినజీవంబు వ్యర్థముజుమ
ముఖవిజితశారదా పూర్ణపూర్ణిమాసి
శాకరమనోజ్ఞ విలసితచారుబింబ.

కాంతా—(తనలో) ఏమి నాయదృష్టము. సకలనృపకోటి కోటీరరత్నమండిత పాదనఖరుండును, దేవీప్రసాద సంప్రాపిత పూజ్య సింహాసనాధిష్ఠితుండును. మన్మనోహరుండు నజ్ఞాతుండై నను ననుకంప జూడుమని వేడికొను భాగ్యముకన్న మిన్నగలదే? ఇంకను బిగువుచేసినచో సరసముముదిరి విరసమగు నేమో యనుభీతియు బొడముచున్నయది లలనలకు డెందంబున పరపురుషాదము కలిగినచో దానిని మరలింప నేరికి సాధ్యముకాదు అందుమదీయ జీవితేశ్వరుడు తనకుతానై కన్పడు టనిల్చి పలువిధములు బ్రార్థించుచుండ నుత్తమసతిమన మెటుల లొంగక నిశ్చలత్వమూని యుండనేర్చును? ఇప్పటికే రోమాంచాది యవస్థావిశేషముల గుర్తించియే యుండును అక్కటా! ఇదియేమియవస్థ! ఎక్కడినుండియో యీపాడుసిగ్గువచ్చి నన్నావరించుచున్నది. ఓధైర్యమా తొలంగిపోవుచుంటివా? నన్నెవరి కప్పగించెదవు. మొట్టమొదట దినపూర్వభాగ జనిత ఛాయావిధంబున నుండు, నీడాంబికమును జూచి మోసపోయి లేనిపోని యలజడికి బాల్పడితిని. ఎప్పటికి క్రీడావతులకు గాంతా జనోచితంబగు క్రీడయెరక్షణీయము. వినినంతత్వరలో లొంగిపోయిన గౌరవముండునా? కావున గొంతకొంత యవకాశము కల్పించుచు మనసిచ్చియు నీయనట్లు ప్రవర్తింపవలయును. [ప్రకా] మదవతీమదనా! పురుషులు తమయక్కరతీరిన తర్వాతముగ్ధలను పలుబాముల నొందింతురు. మొదటనే వారిచెలిమి యంగీకరింపకుండుట శ్రేయస్కరము.

సీ. నిర్వ్యాజప్రేమిడి నెరపుశకుండల
దుష్యంతుచేఁ గడుదుఃఖపడదే
పతికష్టపడసుంచు వనికేగుదమయంతి
శోకను ద్వెగగోసి కొనఁడెనలుఁడు

తపసి ఋణంబుభార్యల నెట్టెనంచును
సతినమ్మెడే హరిశ్చంద్రనృపుఁడు
సభలోనభంగంబు సతినొంద గాంచియు
సమయంబుగాదని శమనసుతుఁడు

గీ॥ కాననెవ్వరు ప్రాణోండ్లకష్టసుఖము
లరయుపాపంబునను బోరుధరణినాథ!
యేల మిథ్యాప్రయత్నంబు లిపుడుచేయ
వలదు బలవంతపరచుట వలదు వలదు.

విక్ర—(తనలో) ఏమి? దీని వాక్యమాధుర్యము, అర్థగాంభీర్యము కల్పనాచమత్కారము. మహాపతివ్రతలచారిత్రమునుడువుచున్నయది. తనయంతరమును వారియంతరమును నరయుచున్నది. దీనిచాకచక్యము ముద్దుతొలకించుచున్నది. మాకుతు కృపాపుడై పూములుక్కల జరపి డెందంబు చిందరవందంబు చేయుచున్నాఁడు. మాటలధోరణి కొంత యవకాశ మొసంగుచున్నది. ఐననిట్లనెదను. (ప్రకా) చెలీ!

ఉ॥ కాలముదాటరానిదయి కష్టపరంపర జెందువేళ స
చ్ఛీలవతుల్ తమంత నెకృశింతురు నాథులటంచు నెంతయుం
దాలిమిశిల్వ లేక కడుధైర్యముబూని జరించిరంటె కా
కోలలనామణీ! విభులునొందర జేసిరె బారిచామలకా.

కాంతా.—కొలఁదిదివసంబులె నీకైవసమందుండి యెడబాయు నావలన పలమేమున్నదిగి కలకాలము సుఖంచినగదా సంతోషము.

విక్రి—అచిరకాలమైనను జన్మము తరించునుగదా?

కాంతా—(చిరునగముతో) నాకోర్కెముందు దీరినగదా మీ కోరికతీరుట.

విక్రి—అడుగుమిచ్చెదను.

కాంతా—నీముద్దుటుంగరము గత్తియునిమ్ము.

విక్ర—ఎంతవెఱ్ఱిదానవే. ముద్దుటుంగరమునా కోరెదవు. నా రాజ్యంబంతయు నీస్వాధీనంబుచేసిన యిష్టానుసారము మెలంగువాఁడ నుగదా. (ముద్దుటుంగరము కత్తియునిచ్చి) సఖి నీముద్దుతీరినదికదా? నాకొకముద్దిమ్ము, (చెక్కిలి చుంబనము చేయఁబోవును)

కాంతా—[సిగ్గుతో జేయియడ్డముంచును]

విక్ర—[రెండవచెక్కిలి ముద్దిడి] ఏమినాజన్మధన్యత.

కాంతా—[తనలో] ఇప్పటికికదా నాపుట్టువు సార్థకమైనది. [ప్రకా] నాథా! నన్నిట సిగ్గుపరపకుము.

విక్ర—సుందరీ! ఆలతాకుంజమున విశ్రమింతమురమ్ము.

[చేయిచేయి పట్టికొని నిష్క్రమింతురు]

ఇది పంచమాంకము.

---

# కాంతామతి.

## షష్ఠాంకము.

రంగము—రాజసభ.

(విక్రమార్కుఁడు, పరివారము, కుమారునితో కాంతామతి ప్రవేశించుచున్నారు)

విక్ర—ఓసీ! నీవు చెప్పుకొనవలసిన దేదియో చెప్పుకొనుము.

కాంతా—తామొక రాచకన్యను వివాహమాడుటయు, దాని నొక కారణంబున బంధనాగారంబున నుంచుటయు, అదియందే మరణించుటయు తమరు విస్మృతిఁజెందలేదుకదా?

విక్ర—ఔను.

కాంతా.—ఆచనిపోయిన కాంతనుదలంచి నాముఖమొకసారి గాంచుడు. అప్పుడునేనెవతనో తమకు తెలియగలదు. [అని మేలిము సుంగుతీసి ముఖము రాజునకుం గనంబరచుచున్నది.]

విక్ర—చూచితిని.

కాంతా.—దానిలక్షణంబు లెవ్వియైనను నాయాననంబున దోచినవా?

విక్ర—చనిపోయిన దాని లక్షణంబులు నీముఖమున గనబడిన మాత్రమున లాభమేమి? మనుష్యులనుబోలు మనుష్యులుండరా? నీవు నాభార్యవని యెట్లురుజువు చేయుదువు.

కాంతా.—దానికేమి లెండు. అదిచనిపోవునపుడొక కమ్మ వ్రాసియుండెనే దానినిమీరు చూచుకొంటిరా?

విక్ర—చూచిన.

కాంతా.—అందలి చివరవాక్యముల నొకసారి స్మరించెదరా?

విక్ర—స్మరించిన

కాంతా.—తిరిగియొకసారి చదువగోరెదను

విక్ర—(మంత్రివైపు చూచుచున్నాఁడు)

కాంతా.—ఆగుము.

విక్ర—ఏమి?

మంత్రి—తన జేబునుండి కాగితముతీసి చదువుచున్నాఁడు!

కాంతా.—ఆవాక్యము తిరిగిచదువుము.

మంత్రి—"నాజీవంబు బాసినతర్వాత నెటులున్న నట్లె చితిని బెట్టవలయునుగాని యొకరైన నంటరాదు."

కాంతా.—దేవా! ఇందలి యర్థమేమని యూహించితిరి?

విక్ర—ఏమున్నది. శవమెట్లున్న నట్లెయుంపుమని.

కాంతా—ఇందేదేని కపటముండవచ్చునని యిపుడు మీచిత్తం బునకు దోచినదా?

విక్ర—స్మృతి తప్పినప్పుడట్లు వ్రాయరాదా?

కాంతా—పోనిండు, తర్వాతనేమున్నదో?

మంత్రి—"ఇట్లు వ్రాసితినని బలవన్మరణము నందితినని యెంతురేమో?

కాంతా—దీని కేమ నెదరు.

విక్ర—జంతుస్వాభావిక మరణమని తెల్పుచున్నది.

కాంతా—పైన నేమున్నదో?

మంత్రి—"జీవముండిన బునర్దర్శనమగునుగాత"

కాంతా—ఇప్పుడేమ నెదరు.

విక్ర—"బ్రతికియుండిన తిరిగి చూడవచ్చు" నని దానియభిప్రాయము.

కాంతా—దీనివలన దానిమృతికపటమని తెలియుట లేదా?

విక్ర—ఔను అట్లయినుకొందము. నీవు నాజాయ వెట్లగుదువు

కాంతా—నాథా! ఆకపటపు మృతినందిన దానను నేననిమనవి చేయుచున్నాను.

విక్ర—అట్లు మాయలుబన్నినందున నీకువచ్చినలాభ మేమి?

కాంతా—నాథా! వెనుక నాయుద్యానవనమునందు నేను విహరించుచుండగా తామొకనాటి మధ్యాహ్నము నన్ను దాహమడుగ లేదా?

విక్ర—నాకేమిజ్ఞాపకము. అనేక దేశములను తిరిగితిని.

కాంతా—అక్కడ మీరొక రాచకన్యహేళన చేయలేదా?

విక్ర—[తనలో] "ఆడుది బొంకిన గోడ బెట్టునట్లును, మగవాడు బొంకిన దడికట్టునట్టు" ననుసామెత దీనియందు సార్థకమగుచున్నది.

ఎంతలోతునకు ద్రవ్వుచున్నది. ఇఁకను దీనిబుద్ధివిశేషముపరీక్షించెదను. నాకేమియు జ్ఞాపకములేదు. [ప్రకాశముగా]

కాంతా—ఔను తమకు స్మరణరాకపోవచ్చును. దానిని వివరింప ననుజ్ఞ దయచేయుడు.

విక్ర—మొదట నేచెప్పకొంటినిగదా?

కాంతా—చ" "అతిథి ... ...నంతకుఁ" అనిమీరంటిరి.

విక్ర—ఇట్లనుట నాకు నేడు స్ఫురించినది.

కాంతా—నేనును దానికి

గీ॥ నిన్న ... ... నెమ్మనమున" అని జవాబిచ్చితిని.

విక్ర—జౌను.

కాంతా—తత్ప్రతిజ్ఞాఫలమే యీకుమారుఁడు భవాత్మజుండు.

విక్ర—జౌనే; ఎంతటిమాయ పన్నితివి. అయ్యది మరణించిన నీవేదియో మోసంబున నాకాయనని నమ్మింపఁజూచెదవా?

కాంతా—ప్రభూత్తంసమా! పోనిండు చెఱసాల గాయునియమించిన భటులనిందు పిలిపించెదరా?

విక్ర—[మంత్రివైపుచూచును]

మంత్రి—ఓరి వేగవంతా!

వేగ—చిత్తము మహాప్రభూ!

కాంతా—నాతండ్రిగారితో నాడుమాటాడుచుండగా నపుడు నీవుంటివిగదా?

వేగ—అవును.

కాంతా—నేనాయనతో నేమంటిని?

వేగ—గుండముత్రవ్వించిన నందుబడిపోయెద నంటిరి.

కాంతా—నాథా! దీనికర్థమేమందురు.

విక్ర—ఏమున్నది. గోతఁబడి నశింతునని.

కాంతా—చిత్తము. అట్లనే (వేగవంతునితో) ఇంక నేమంటిని

వేగ—నాకధోమార్గమే శరణంటిరి

కాంతా—దీనికేమి యోచించెదరు?

విక్ర—నరకమే శరణనిభావము

కాంత—క్రిందిదారికి నధోమార్గమున రాదా?

విక్ర—అదియుగలదు.

కాంతా—(వేగవంతునితో) ఇంక నేమంటిని.

వేగ—నన్నుబోలు నిర్భాగ్యురాల నేలసృజించితి,, వంటిరి.

కాంతా—ఇందలిగూఢ మేమని తలంతురు?

విక్ర—విచారసమయము చేనట్లు బలికియుండవచ్చును.

కాంతా—కాదుకాదు నారూపునొక బొమ్మచేయించుమని

విక్ర—(తనలో) ఎమిదీని నెఱజాణతనము

శా॥ ఔరా! ఎంతటిజాణయీలలన మాయల్ బన్ని కన్గప్పి దా
గారాగారమువాసిపోయి తుదకుంగార్యంబు సాధించి ప్ర
జ్ఞారాహిత్యుని జేసె నన్నిపుడు రాజ్యంబంత బాలింపనీ
మారాకారుఁడునా కుమారుఁడుదగుఁ మాటాడనింకేటికిఁ.

ఐనను త్తమకులోత్పన్నుఁడు నిర్మలకీర్తిశాలియై యుండవలయును దీనిమాటలపాటించి నేవరిగ్రహించినచో బ్రజలకు వీఁడౌరసుఁడగునో కాఁడోయని యనుమానము బాధించుచుండును. కావున దైవసాక్ష్యము కలుగువరకు నంగీకరింపక బిగువుచేసెదను. ఓహృదయమా! పుత్రగాత్రపరిష్వంగ సుఖాభిలాషవయ్యు కొంచెమోపికబట్టుము (ప్రకా) ఓసీ ఎంతటిమాటకారివే? ఎంతటిమాయలాడివే? ఎట్టియుద్యమముబూనితివి పట్టపగలు కనుమూసి గంతగట్టఁజూచెదవా?

కాంతా—రాజేంద్రా! నాటిరాత్రి మనపడకటింటిలోని సంభాషణమందు నేనాడినమాటలగూడ నొకసారి విమర్శింపఁ గోరెదను.

విక్రి—ఏది?

కాంతా—గీ. సతుల మత్సరంబు,,... ఇందలిభావము విచారిం చితిరా

విక్రి—ఓసి నీచురాల! ఇట్టి కల్పితంబులతోఁబనేమి

కాంతా—రాజపురంధరా! తాము వేటకై దయచేసినప్పుడొక సుందరింగూడితిరికదా? అయ్యదియును పరాకుపడితిరా?

విక్రి—(తనలో) దీనికేమని యుత్తరమీయవచ్చును. అడవి లోనిసంగతి దీనికెట్లు తెలిసినది. అంతఃపురమందలి వర్తమానములెట్లు గ్రహింపగలిగినది. నిజముగానియ్యది ప్రజ్ఞావంతురాలు, నాతపంబు సార్థకమొందినది. ఇట్టిశీలవతి దొరకుటరాజ్యంబుకన్న నెక్కుడుగదా? (ప్రకా) నాకేమియు దెలియదు.

కాంతా—నాథా! తెలియదందువా? దానికిమీరొసఁగినప్రో కాప్రో యీకత్తియు, ముద్దుటుంగరమును గనుడు, (అని కత్తియు ముద్దుటుంగరము నిచ్చును.)

విక్రి—నీవెన్ని చెప్పినను విశ్వసించను. వీనినెవరైన తస్కరించ వచ్చును, లేదా నేనెక్కడనైన మరచిపోయిన నీకుదొరకవచ్చును.

కాంతా—ప్రాణనాయకా! ఇవన్నియు గల్లలేనా? తామునన్ను బంధించిన గృహమందలి సురంగమును బరిశీలింపించెదరా?

విక్ర—ఇటీవలదస్కరు లెవరైన ద్రవ్వియుండరాదా?

కాంతా—మహానుభావా! నిద్రించువానిని లేపుట సుకరము గానిమేల్కనువానిలేపుట కెవరికిశక్యము? ఇఁక సమాధానములు మిము మెప్పింపలేను వల్లభుఁడొల్లకున్ననిదే వారలకెవ్వరుదిక్కను సామెత నా యందువర్తించినది. ఓసూర్యచంద్రాది దేవతలారా! మీరంటు నా లకింపుఁడు. పంచభూతములారా! తటస్థభావమువిడచి సత్యముపలుకు డు, నాపాతివ్రత్యమహిమ నిరూపింపుఁడు.

గీ. భర్తృపాదములనెపుడు స్వాంతమందు
 దలచివర్తింతునేని నాథవుఁడు ధర్మ

శీలుఁడై నన్ను మన్నింపఁజెలఁగుదాన
నేనిమత్సతీత్వము నిల్పనెంతుగాత

(తెఱలో నాకాశవాణి)

రాజా! ఈమెనీజాయ సందేహమువలదు ఈకుమారుఁడు నీకు మారుఁడు. ఈమెపల్కినదంతయు యథార్థము అనుమానము మాను ము పతివ్రత యననీమెయే,

విక్ర—(సభాసదుల వంకజూచి). వింటిరా! ఆకాశవాణివా క్కులు. నేనింతతడవు తర్కించకవిడిచినచో నిందలియదార్థము లోక మునకు దెలియకపోవచ్చును. (కాంతామతినిజూచి) సఖి! నీపాతివ్రత్య మాకాశవాణి నిర్ణయించినది. నీప్రతిజ్ఞనిల్పుకొంటివి. కుమారా! ఒక్క సారివచ్చినన్ను బిగ్గఁగౌఁగిలించుకొనుము. (అని కుమారునెత్తికొని ముద్దాడి) బోటీ! నీకార్యము సఫలీకృతమైనది. ఇఁకేమికావలెను.

కాంతా—సర్వమీడేరినది. ఐనను

గీ. సతులుపతులతో కలహంబుజల్పి నింద
బొందకుంటయు పతులును ముదముమీర
కాంతలంగని ప్రజలలోన గౌరవంబు
గాంత్రుగావుతశ్రీరమా కాంతుదయను

విక్రమార్కుఁడు—తథాస్తు

(అందఱు నిష్క్రమింతురు)

ఇది శ్రీసుందరరామ కరుణాకటాక్ష లబ్ధసరస కవితా
ధురీణ శౌనకసగోత్ర పవిత్ర కృష్ణయార్యపుత్ర
వేంకట రామాఖ్య ప్రణీతంబైన
కాంతామతి అను దృశ్య
ప్రబంధంబునందు
సర్వంబు షష్ఠాంకము
సంపూర్ణము
శ్రీ కృ ష్ణా ర్ప ణ మ స్తు.

---

# పాటలు.

1 [కాంతామతి]

నన్నింక-మారు కేళీ-గూఁకుమా మనోహరా-

ఆ-పంతమ్ముఁ_విడ-నాడ-జేయుమా॥ నన్నిం॥

శిరీష - కుసుమ - పేశల - చారు - శరీరా - మధన - శత - సుంద

రా - కారా-

కందర్ప - ధనుర్ముక్త - తీవ్ర - బాణా - నలంబులనకు- లోనై తిరా

శతృత్వ-మేల-జేచెదో-వి_-శాలనేత్ర-ధీవరా॥ నన్నిం॥

2 [విక్రమార్కుడు_కాంతామతి]

వి___కలికి- నిను- నే- కలి_ సెద- నని-నీ

స్వప్నమందైనను - తలపక - జనుమా

కాం___ప్రాణవల్లభా - నన్ - మోహాబ్ధిని్ - ముంచి - యిట్లు

పలుకన్-ధర్మమా- నన్నిట్లు- జేయుగ - భావ్యమా

వి___ఓ- మాయాడి- నీ - వింక- బ్రేలకుమా

రయమున- జనుమా- నోరు- మూయుమా

కాం___నాథా- యెంతగా- బ్రితిమి- లాడిన-

దయ-గన వేమో- మనోహరా

3 [చెరసాలయందు - కాంతామతి - తనలో]

బ్రహ్మ-వ్రాసిత-దాట-తరమా-తొలుత మహీం-

రాజ్య పాలనము-సలిపిన-త్రిశంక-పుత్రుడు-అడవుల-

కష్టంబుల-బడలేదా

నళనృపతి-విక్రృతుడై-ప్రేయసినడవి- వదలి- పిమ్మట- కష్టముల-

బడుచు-జనలేదా

నేనొకర్తనె- పృధ్విణ - గలిగితి నే- నిర్భయముగ- విధిగడు- వగ
దర-మగు నే॥

4 (చెరయందు కాంతామతి)

న్యాయమా- నన్నిటుల- జేయుట?-నాధా-నా-ప్రాణనాదా
మీాయనుగ్రహ-మిప్పటికై న-మాాయబలపై-రాలేదా? ॥న్యా॥
తోడివారు లెల్ల-ప్రియులగూడి-సౌఖ్యములదేలి-యాడు- చుండ
నాపాపమా-విరహాగ్ని-గూల ॥న్యా॥
మూడేండ్ల-నుండి నన్ను-యీాకార-యందుంచుట-మీాకు
శ్రేయమా- నాధా-ప్రాణనాధా ॥న్యా॥

5 (కాంతామతి)

ప్రాణేశా-నాపై నింత-పగయెందుకు మీాకు ?
నా నెపమది యేమి? నాతోడను దువరాధా? ప్రా॥
నన్నిటుల-నిరాకరించుట-న్యాయమా?
చను నే-కులసతి - నీవిధ చునుట ఎన్నడుదయవచ్చునో-ఎప్పుడువ
త్తురోయని-జూచుచుండ- నేటితో-నున్నయ య్యో- నాయాశ॥

6 (కాంతామతి)

ఈశ్వరా-నాయెడల-నీ-కిట్టినిర్దయ-గల్గెనాపర-మేశ్వరా
శాశ్వతంబగు-ధర్మ వేమై ఈశ్వర్యుని నమ్మి
యుంటినేజగ-దీశ్వరా॥

7 (శక్తవర్మ)

యింతా- ఘోర-మానటంచు- నే-దలప న్మైతిగా
ధర్మసీలుడటంచు- నే-నాకొమరిణ నివ్వ
సాకి॥ { కారాగారమందు-కష్టపెట్టు చుండె
కనికరము లేక కలుషాత్ముండు }
తానొకటి-దలంప-దైవ-మింకొకటి-తలంచుచునట్లు-సత్యమాాయగా॥

## 8 మంగళం.

మంగళం భవంతు తేర మామనోహరా-సదా - అంగజారినుతపద

భవ-భంగఖగతు-రంగ-శయా హ॥

నీరజ-భవస్తోత్ర-నిర్జరరిపుజైత్ర-నీల-వారిద-గ త్రనిరుపమ

చారిత్ర-కారుణ్యాబ్ధియాద-కాళహస్తి-సూర్య-ప్రకాశ-దాన

పోష-జగదీశా-పరమేశా॥

N.B. యీ పాటలు నాఅనుమతిలేనిది ఎవ్వరు ముద్రింపఁగూడదు. కె, యస్‌' పి, రావు.

---

3వ ఫారం మొదలు ఆఖరువరకు,

శ్రీచింతామణిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడిరొ, రాజమండ్రి—1928.

# రోషనార

అను జహ్వేరీబాయి

మహారాష్ట్ర నాయకమణియగు శ్రీ శివాజీ మహారాజు. ఔదార్యము రామసింహుని దేశభక్తి రామోజీ దుర్మోహము డావూదురజావుల హాస్యసంభాషణము చదివిన హాశ్చర్యము కలుగకపోదు యువరాజుయొక్క యవ్యక్తపరిపాలన జహ్వేరీబాయికి శ్రీశివాజియెడగల నిష్కల్మషప్రేమ ఆమె యుద్ధకౌశలము వేయేల ఒకొక్కరంగమందు విచారము ఆనందము భయము కలుగుజేయునని మేమునమ్ముచున్నాము చక్కనిసాంగ్సు 28 గలవు వెల 1—0—0 కొద్దిరోజులువరకు పోష్టు మేమె భరించిపంపుదుము.

## ప్రకటన.



మావద్ద అన్నిరకముల స్ప్రబ్సు చత్వారము గలవారికి పనికివచ్చేవి సలవఅద్దములు విక్రయించబడును.

వలయువారు:—            వి. బి. లక్ష్మయ్య, రాజమండ్రి.

(నాగరాజా ఋతుశూలనివారిణి)

స్త్రీలపాలిటి వరప్రసాదము.

వేనవేలు యోగ్యతాపత్రికల నొసంగిరి.

త్వరపడుడు—            ½డ్రా 1—8—0

1డ్రా 2—8—0

వి. నాగయ్య అండ్ కో, రాజమండ్రి.

హారతికర్పూరపు దండలు.

మేము అన్నిరకములు హారతికర్పూరదండలు సాదావియు జల్తారుతోను మిరియాలపేర్లును పుల్లలును సరసమైనధరలకు విక్రయించెదము.

ఆకుల వెంకటరత్నము, రాజమండ్రి.

# ఆంధ్ర నాటకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| గయోపాఖ్యానము చి॥ల | 0 | 8 | ప్రహ్లాద | 1 | 0 |
| ప్రసన్నయాదవము డిటో | 0 | 8 | సంగీతసావిత్రి | 1 | 0 |
| పారిజాతాపహరణము | 0 | 8 | సత్యవిజయము | 1 | 0 |
| చతురచంద్రహాస | 0 | 8 | శ్రీసాహసము | 0 | 11 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥కృ | 1 | 0 | కృష్ణరాయభారము | 0 | 12 |
| కలభాషిణి డిటో | 1 | | కృష్ణరాయవిజయము | 0 | 12 |
| రాజభక్తి డిటో | 0 | 8 | మదనసుందరీపరిణయము | 1 | 8 |
| మోహినీ మనోహరము ,, | 0 | 8 | శ్రీనివాస కల్యాణము | 0 | 8 |
| వేణీసంహారము వ॥ను | 1 | 0 | సురాజుద్దౌలా | 0 | 8 |
| ఊర్వశీ శాపవిమోచనము | 1 | 2 | వేశ్యాహితబోధిని | 1 | 0 |
| గర్వభంగము | 0 | 12 | మహానంద కొ॥నం | 0 | 12 |
| ప్రతిజ్ఞాయాదవము | 0 | 12 | కనకతార ద్రౌ॥సి | 0 | 12 |
| శ్రీకృష్ణవిలాసము | 0 | 12 | కృష్ణతులాభారము | 0 | 12 |
| గులేబకావళి | 1 | 0 | మాలతీమధుకరము | 0 | 12 |
| పసన్ బకావళి | 1 | 0 | ప్రభావతీప్రద్యుమ్నము | 1 | 1 |
| ప్రతిజ్ఞాపాండవము | 0 | 12 | సంపూర్ణభారతము | 1 | 0 |
| పాండవవిజయము | 1 | 1 | సుమతీదేవి | 1 | 0 |
| పాండవాశ్వమేధము | 0 | 12 | సువర్ణపాత్రి | 1 | 0 |
| పాండవజ్ఞాతవాసము | 0 | 8 | చంద్రకాంత | 0 | 12 |
| జయంతజయపాలము | 0 | 12 | చింతామణి కా॥నా | 1 | 2 |
| కనకతార | 0 | 12 | పద్మవ్యూహము | 1 | 0 |
| మహానంద (క్రొత్తనాటకము) | 1 | 0 | కాంతామతి | 0 | 12 |
| సంపూర్ణోత్తరరామాయణము | | | పారిశాల స్వయంవరం | 0 | 12 |
| సాంగ్సుతో | 1 | 4 | జారవిలాసం | 0 | 12 |
| లంకాదహనము | 0 | 10 | వరవిక్రయం | 1 | 0 |
| కుశలవ | 1 | 0 | శతకంఠరామాయణం | 0 | 12 |
| లవకుశ | 1 | 0 | పాదుకాపట్టాభిషేకము | 0 | 12 |
| కృష్ణలీల | 1 | 0 | కబీరుదాసీయము | 0 | 12 |
| భీష్మప్రతిజ్ఞ | 0 | 12 | తులసీదాసీయము | 0 | 12 |
| శారదావిజయము | 0 | 12 | రోషనార-జవ్వారీబాయి | 1 | 0 |
| రసపుత్రవిజయము | 1 | 0 | చిత్రనళీయము | 1 | 4 |
| సారంగధర | 0 | 8 | వరూధిని | 1 | 4 |
| వలయువారు — | | | విషాదసారంగధర | 1 | 6 |

సంస్కృతాంధ్రబుక్కుడిపో, రాజమండ్రీ.